# బాలనాగమ్మ

(ఆరు అంకముల స్టేజినాటకము)

రచన:

'నాగశ్రీ'




పబ్లిషర్సు

ఆంధ్రరత్నబుక్‌డిపో తెనాలి



1958

వెల రు. [illegible]

# ముఖ్యపాత్రధారులు

| పురుషులు | స్త్రీలు |
|---|---|
| 1. కార్యవర్ధిరాజు | 1. బాలనాగమ్మ |
| 2. బాలవర్ధిరాజు | 2. విజయలక్ష్మి |
| 3. పులిరాజు | 3. మాలతి |
| 4. మరాటి | 4. సంగు |
| 5. కొత్వాలు | 5. కాళి |
| 6. తిప్పడు | 6. తిప్పి |

ఇంకా తదితరులు



## సవరణ

పుట 14లో మూడవ రంగమునకు బదులు "మొదటి రంగము" అని చదువుకొనవలెను.

# బాలనాగమ్మ

## (ప్రథమాంకము)

### నాంది

అనయము భర్తృసేవ విడనాడని సద్గుణరాసి; మేటి పు
త్రుని కడుపారగన్న యొకదొడ్డపడంతి; ప్రమాదమై-నిజే
శుని వచనంబుదాటి కడుశోకముపాలగువేళ-తన్నుగా
చిన నిజశీలమే యిపుడు చిత్తములొప్పగనేలు వీరలన్.

(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశము.)

సూత్ర:- నటీ! నటీ!

నటి:- (పవేశించి) నాథా! నన్నేలపిలిచితిరి?

సూత్ర:- ప్రేయసీ! చూచితివిగదా సర్వకళామయులైన సభాసదులతో నిండియుండిన యీ సభారంగంబు. ప్రేక్షకుల హృదయంబుల రంజింపజేయగల నాటకంబొండు నేడిందు ప్రదర్శింపవలయును. అందులకుం దగిన నాటకంబెద్దియా యని నే నాలోచించుచున్నాను. కోమలాంగులు కుశాగ్రబుద్ధి గలవారుగదా, నాకన్నను ముందుగా యోచించి నాకు సహాయమొనర్పుము.

నటి:- జీవితేశ్వరా! మీకునాయందుగల యనురాగంపు పెంపున [illegible]ంచితిరేకాని, నిజముగ నేను మీకిందు కరణ[illegible]

దానవా? అయిననూ పతి నను్ఙ్ఞ ననుసరించక పోవుట సతికి ధర్మముకాదు కావున నాశ_క్తికొలది ప్రయత్నింతును.

ఉ॥ మాయ ఫకీరు బూటకపు మాటలునమ్మి నిజేశు డట్టు లా
పాయత గీయుగీటు వలసంతమొదాటిన నాటిబాల క
న్యాయముగల్గ లేదె ? జలజాక్షులదెంత పతివ్రతాసిరిన్
బాయని వారలైన పతివాక్సరణిన్ నిరసింప వచ్చునే !

సూత్ర:- చెలీ ! చక్కనికథను జ్ఞప్తికి తెచ్చితివినుమా ! పరమ పతివ్రతా తిలకంబగు బాలనాగమ్మ చరిత్ర నిందు నాటకరూపమున ప్రదర్శించుట యెంతయో బాగుండును, ఏలనన ? భూలోకంబున నేడునూ మహాదాదర్శనీయమగు దాంపత్యమందలి నిరుపమాన నిత్యసౌశీలవతులెందరో మాయోపాయముల కపట నాటకంబులనమ్మి నాథుని సహాకరించుచుంటిమను భ్రాంతితో ననేక కష్టనిష్టురంబుల పాలగుచున్నారు. అట్టివార లీ కథ విని నచో నాటి బాలనాగమ్మవోలె, తమ హృదయములను నిష్కల్మషముగా నిల్పుకొని శీలమర్యాదల కాపాడుకొని పతినామ స్మరణను పరమ మంత్రముగ ధ్యానించుకొని, భారతాదర్శ నారీలలాములు కాగలరు. కావున మనమిందా బాలనాగమ్మ నాటకమునే ప్రదర్శింతము.

నటి :- నాథా ! మీ యిచ్ఛవచ్చినటులు "బాలనాగమ్మ" యను నాటకమునే ప్రదర్శింతము. అందుకు తగిన పాత్రలను సిద్ధము చేసెదను, కాని మనమిపుడు ప్రదర్శించవలసినది...

సూత్ర:- ఎవరిచే రచింపబడిన నాటకమనియా ?

నటి :- చిత్తము.

సూత్ర:- దానికింకనూ వేరాలోచనలేల.

సీ॥ అమ్మణీ బ్రహ్మయాఖ్యుల కగ్రసుతుడు;
కాశ్యపఋషి గోత్రోద్భవ కవి వరుండు;
పూత నాగేశ్వరీ, యన్నపూర్ణలకు ని
జేశుడా వంగవోల్ వెంకటేశ్వరుండు.

నటి :- ప్రాణేశ్వరా! అతనిపేరు వేంకటేశ్వరుండై యుండ "నాగశ్రీ" యనుచు చెప్పుకొన గారణమేమి ?

సూత్ర:-అదియా నీ సందియము. తన ప్రథమ భార్యమీదగల యను రాగంబు పెంపున చిన్న భార్యయగు అన్నపూర్ణమ్మను "నాగాన్న పూర్ణేశ్వరీ" ! యని పిలుచుకొనుచు, నందు తృప్తిపడక తనపేరు నందా నాగేశ్వరమ్మ నామము స్ఫురించుటకై తనపేరు "నాగశ్రీ" యని మార్పు చేసికొనెను. ఇపుడు మన బాలనాగమ్మ నాటక రచయితగారిపేరు "నాగశ్రీ"

నటి : ధన్యురాలను నాథా! నాటకము బాలనాగమ్మ చరిత్ర. నాటక రచయిత నాగేశ్వరమ్మకు ప్రాణేశ్వరుడు. వారికీ, వీరికి నిష్ట దైవమా నాగేశ్వరుడు. ఇంకేమి? అనుకొనుచుండగనే అవసర మయిన పాత్రలుగూడా నలంకరింపబడినవి. అదిగో, అటు చూడుడు. బాలనాగమ్మ నాగేశ్వరదండకమును పఠించుచున్నది. మనమును త్వరగాబోయి నాగేంద్రస్వామి తీర్థప్రసాదంబుల గైకొందమా ?

సూత్ర:-అర్ధాంగిమాట కభ్యంతరమున్నదా ? అతిత్వరగా నాప్రక్కకే నడువుము.

నటి :- దయచేయుడు— (ఇరువురు నిష్క్రమింతురు)

ఇదినాందీ ప్రస్తావన.

# రెండవ రంగము

(ఉద్యానవనము; నాగమల్లిచెట్టు ప్రక్కన, నాగేంద్రుని ప్రతిమను ముందుంచుకొని భక్తితో పూజలు చేయుచు బాలనాగమ్మ కూర్చొనియుండ తెరతీచును)

నాగమ్మ:- (చేతులు జోడించి—దండకం)

* శ్రీ దివ్య నాగేశ్వరా! పుణ్యభూమీశ్వరా! రాజరాజేశ్వరా! భక్తరత్నామణీ! దీనచింతామణీ! భూరిసీశక్తి, నీయుక్తి, నీభుక్తి, నీసూక్తి, నీరక్తి భాషింప - వర్ణింప, కీర్తింప నేనెంత పుణ్యాత్మ! శ్రీ మన్మహావిష్ణు తల్పంబువై-యంబికానాథు డింపారగాదాల్చు మేల్ కంఠహారంబువై - బ్రహ్మకుం జేతిగంథంబువై-విఘ్నరాజేంద్రు యజ్ఞోపవీతంబువై - శాస్త్రశాస్త్రాంగ విస్తార విద్యాప్రవీణుండవై - సారసంగీత మాలించి నృత్యంబులన్ జేసి మెప్పించు శ్రేష్ఠుండవై - గాడ్పులన్ మెక్కి-జీవించుమహానిచంద్రుడవై-వైరులే తెంచు గూఢప్రదేశంబులెందైన గుర్తించి నేతెంచు ధీరుండవై - శాత్రవానీకమున్ గూల్చుదక్షుండవై - భక్తులన్ గాచు దేవాది దేవుండవై - భూభరంబెల్లయున్ మాళిపై మోసి రక్షించు నీ నీ స్వరూపంబులుర్విన్ ప్రతిష్ఠించి సంకల్పసంతాన సౌభాగ్య సమృద్ధులైనారు ముందెందరో దేవ! కష్టంబులున్ నష్టముల్ నిష్ఠురంబుల్ దొలంగన్ మనోవాక్క్రియానంద సత్సౌఖ్యసౌభాగ్యముల్ సర్వదా మాకు చేకూరు మాడ్కిన్ దయాదృష్టిన్ ప్రసాదింపుమా, యుత్తమాదర్శ వాంఛల్ ప్రసాదింపుమా, నీ పదధ్యానశక్తిన్ ప్రసాదింపుమా, ప్రావిడుల్ నిన్నుకై వారముల్ సేయరే నిన్ను నేగొల్తు నాకామ్యముల్ గూర్చు స్వామీ నమస్తే! దయాస్వాంతమూర్తీ నమస్తే! మహాత్మా నమస్తే నమస్తే నమః.

---

* ఈ దండకము కవిగారి నాగేశ్వర దండకమునుండి గ్రహింపబడినది.

(అని చదువుచుండగనే కార్యవర్ధిరాజు ప్రవేశించి చిరునగవుతో మెల్లగ బాల నాగమ్మ వెనుకనిలుచుండి చూచుచుండును. బాలనాగమ్మ భర్తగాకను గమనింపకయే నాగేంద్రునకు నమస్కరించి, లేచి, కార్యవర్ధిని గాంచి చిరునవ్వుతో తల వంచుకొనును.)

కార్య:- (చిరునగవుతో) నాగూ! నాగేంద్రప్రసాదమును కనుల కద్దుకొనుచున్న నీ నవలావణ్యమెంతయూ నయనానంద మొదవించుచున్నది సుమా!

నాగ :- నాథా! అది ప్రకృతిసైజ స్వభావమేగదా?

గీ॥ సహజ చైతన్యమున్న వజ్రంపుతునక
పలకలెటులున్న ఘనకాంతి బరగునటుల
పతికి నిత్యానుకూలయౌ పడతి యెట్టి
వేషమందున్న మోదంబు వెలయుగాదె!

కార్య :- బాలా! ఎంత వాలాయముగ బదులాడితివి?

గీ॥ అందచందాల వదనారవిందమునకె
పైట కడుగిడలేక నీబందిసైతి
మంజుభాషల మఱపించి మరలనన్ను
గట్టివైతు వేలనో బాల! కరుణమాల.

నాగ :- (సిగ్గుతో) అబ్బ! చాలించండి మీచలోక్తులు. మగవారల కుయుక్తులు మగువలకు క్రొత్త సూక్తులు కావుగదా!

కార్య :- ఇంతీ! ఇంతలో నెంత వింతగా పంతము లాడుచుంటివి? (కొంచెమాగి చిరునగవుతో) ఆఁ! అన్నట్లు, ఈ అసమయ రౌద్రాకారమెంతయూ నీమోమున కలంకారముగా నున్నది సుమా!

ఉ॥ చందరువోముులో మసక చల్లిన చుక్కలు శోభగూర్పు నా
చందమునన్ మనోహర ప్రశాంత భవన్ముఖమందు నీ
కుందగు సుందరీ! ప్రణయ కోపమదొక్క విమూత్న మోహమిం
పొందగనింక నేనెటకు బోగలవాడ నినున్ త్యజించుచున్.

బాలా! ఏల యీలీల జాలము?

ఉ॥ దోసములేదు నాయెడ నెదో సహజంబగు భావమందు న
భ్యాసమునైన హాస్యమున కట్లనుటొన మహాపరాధ మిా
రోస మిదేల, బాల! నెనరున్విడి మూతిబిగించి నన్నిటుల్
మోసముసేయ నీకిదొక పుణ్యమనా? పురుషార్థమానా?

నాగ:- (అనురాగముతో సమీపించి) జీవితేశా! లలనామణులకు మనోనాయకుల లాలనంబులే మనోహరవిలాసంబులు కదా!

గీ॥ ఎవని రంజింప లోనెంచి యిందువదన
లనుదినాలంకృత నిమగ్నలౌదు రట్టి
బాల కాత్మేశుడే మోహలాలనముల
గదియు భాగ్యంబు కన్న భాగ్యంబుకలదె!

కార్య:- అవునుప్రేయసీ! విశ్వమంతయూ ప్రేమమయము. ఆ ప్రేమ మధురప్రాయము. ఆ మృదుమధురానురాగము లేనినాడీ, ప్రపంచమె వ్యర్థము. వ్యర్థజీవితము దుర్భరబాధాకరము. దేవీ ఇటుచూడు ప్రేమమయ స్వరూపమైన యీ వనలక్ష్మిగూడా యెంత సుందరముగా నున్నదో?

సీ॥ కిలకిల నగవులా గేలింతలనుజేల
పితనాధులనుగూడు శుకము లచట!

పెడవితేనెల విందు భృంగపతికొసంగ
　　　　ముద్దులొలికెడు పూమొగ్గలచట !
అనురాగజంటల కాదర్శమై విహా
　　　　రంబుసల్పు చిరుమేఘుంబు లచట !
పిల్లగాడ్పులవెంట మెల్లగాపయనింప
　　　　తరలివచ్చెడు సుగంధంబు లచట !
గీ॥ విబుధదానవ మర్త్య పిపీలికాది
　　సర్వసర్వంసహాధరాచక్రమందు
　　నచట నిచటనగనేల నెచటనైన
　　ప్రేమ ప్రేమ ప్రేమమయంబె వెలదిగనుమ !

నాగః— అవును నాథా ! మీరనినట్లు ప్రేమ ప్రతివారికి జీవితానంద దాయకముగదా ? అందులకు నిదర్శనముగ నాపొన్నమానుపై కూరుచున్న కపోతంబుల నవలోకింపుడు. ఆహా ! ఆ దృశ్య మెంత రామణీయమై నేత్రపర్వంబొదవించుచున్నది. నాథా ! చూచు చుంటిరిగదా. లభించిన నాయాహారము నెంతపరస్పరాను రాగ ముట్టిపడ విభజించుకొని నాకపోత మిథునంబెట్లు భుజించు చున్నదో, అయ్యయ్యో! జీవితేశా! మనమిందు నిలిచియుంతగనే నా పావురాతిజంట కెట్టి ప్రమాదము సంభవించినది.

　గీ॥ మనసు మనసులో లీనమై మాటగలిసి
　　తనువులే రెండు బొమ్మలై ధాత్రి; నాడి
　　పాడి, గూడుచుండు ప్రియదాంపత్య మందు
　　కలదె యెడబాటు కన్న దుఃఖంబు నరయ!

కార్యః— అవును బాలా ! ఈ విషాద దృశ్యము మన హృదయములకు గూడ జాలిని గలిగించుచున్నది సుమా.

గీ॥ కొసరి ప్రియతమతో ముద్దుకొసరుకొనుచు
పోతొక సమీప శాఖపై ప్రీతిప్రాల
మాయదారి కిరాతు డన్యాయమనక
నుచ్చువలల పెంటినిబట్టినొడిసి యకట.

నాగ:— నాథా! నా హృదయ మెందులకో కీడును సంకల్పించి కలవర పెట్టుచున్నది. అదియునుగాక గడచినరాత్రి నేనొక దుస్వప్నము గూడ కంటిని. ఇపుడా కలల తలంపునకువచ్చి నామనసును మరింత భయపెట్టుచున్నది.

కార్య:— కలలు దలంచుకొని కలవరపాటు చెందుట కలికీమణులకు నైజమేగద లలనా! అయినను అట్టి బేలతన మే సామాన్యాంగ నలకోగాని నీవంటి వీరపత్నులకు తగునా! నాగేంద్ర వరప్రభా వంబున జన్మించిన బాలనాగమ్మవు. మా సోదరి భూదేవికి ముద్దుల పట్టివి. పానుగంటి పురాధీశ్వరుని యేడవ కోడలవు. ఈ కార్యవర్ధి భూపాలుని కనుంగు పట్టమహిషివైన నీవేమి? యింత బేలతనంబుగా బలుకుచేమి? ఇది మన క్షత్రియ వంశ మునకే తీరని కళంకముగాదా? వీరనారీ లోకమున కాశ్యాస్ప దము కాదా? వాటిమాటకేమిగాని, నాభార్య యింత పిరికిపంద యన్న ముందు నాకెంతయూ చిన్నతనము కాదా? నాగూ! రేపో, మాపో బుట్టనున్న మనచిరంజీవికీ పిరికిపాలు పోయుదువా?

నాగ:— ప్రాణేశ్వరా! మీ రటు లనతగదు. నా భీతికిం తగిన కారణము లేక పోలేదు. అదెద్ది యందురేని?

గీ॥ వైరిసేనల దునుమాడ బావ లిపుడు
యుద్ధభూమి కేతెంచి వారున్నవారు;

పగతులు_త్తేజ శౌర్యాగ్నివంతులైరి
జయపతాక మువ్వారిదంచు సంశయింతు.

దయచేసి మీరును బయలుదేరండి—ఆర్యవరన్నల కండగ కదన భూమిని ఖడ్గముబట్టి స్వైరవిహారముసేయండి—పానుగంటి పుర లక్ష్మికి జయశ్రీని చేకూర్చండి—కార్యవర్ధి భూకాంతుని క_త్తి పదును రిపువర్గసేనా పరంపరలకు చవిచూపండి-లెండి, పయ నంబుకండి నాకు వీరపత్నీనామమును సార్థకముచెయ్యండి.

కార్య:- అమ్మయ్యో, నేనువెళ్లను—వెళ్లలేను.

గీ॥ నెలలు తొమ్మిదినిండిన నెలతవీవు
యిపుడో, యీమాపో ప్రసవింతు విట్టివేళ
గాజుకన్న భద్రంబుగాగాంచదగిన
నిన్నువిడనాడి చనజాల నిజముబాల !

నాగ:- ఆర్యపుత్రా ! మీకు నాయందింత మమకారముండుట యెంతయు సంతోషదాయకంబె కాని, అసాధారణ శాత్రవ సైన్యంబుల డీకొనిన మీ యన్నగారలయందీ సహాకారాభి మానములేకుంట మరింత సంతాప హేతువయ్యె. రాకుమారా అరిరాడ్వర్గ ప్రతాప మొకవేళ విజృంభించినచో మనము పరరాజుల బందీలము కామా ? మన దుర్గంబు సమస్త సేనా సమేతంబుగ శాత్రవుల కైవసముకాదా ? అట్టియెడ మీకీ పానుగంటి పురాధికారానందాఖిలైశర్యంబులు దూర ములుకావా ? పుట్టనున్న మన చిట్టిపాపాయిని రేపు నట్టడవు లలోపెట్టి—చెట్టు గుట్టల నడుమ, పుట్టకోనలలో పెంచెదరా? నామాటలాలకించండి-నాప్రార్థనల ననుగ్రహించండి-తొందర పడి వెంటనేలేవండి — చంద్రహాసమును చే ధరించండి — విజయలక్ష్మి కరగ్రహణంబు గావించండి—మా కానందమును ప్రసాదించండి. ఇంకను చూచుచున్నారా ? వెనుక ముందు లాలోచించుచున్నారా ? బైటకడుగిడ భయమందుచున్నారా?

అటులయిన యిది రాజాంతఃపురముగాని, రణరంగముకాదు—ఇందున్నది స్త్రీజనంబులుగాని సేనాసమూహంబులుకావు—ఇపుడు కావలసినది భండనభూమిని ఖడ్గధారణగాని, భవన భోగంబులలో భామాకలాపములుగావు—లేదు. మీతోడ పనిలేదు — మీకిందేమియు నుండదగిన కారణములేదు—నా ప్రసూతికి మీరిక్కడ చేయవలసిన మంత్రసానితన మెంత మాత్రమునులేదు—పుట్టినబిడ్డకు బొడ్డుకోయు గత్యంతర మంత కంటెనులేదు.

గీ॥ అక్కలార్వురు పెద్దవారైనవారు
మాటవరుసగ ముందొక నాటికైన
మాపతు లనిసేయంగ నీమగడు వెలిచి
యింట కూర్చుండెనని వచియింపగలరు.

ఆలోచించండి పౌరుషనీయులయిన ప్రభువులవారింత పరాకు సేయుట భావ్యమా ?

చ॥ వదినలు గేలిసేయ; నిజభ్రాతలు తేలికచూపుచూడగా
పదుగురు లేసిమాటలను బల్కగ, నింట సతీప్రసూతికై
బెదరిన పందవోలె ఘనవీరపరాక్రమ మెల్ల దాచి యీ
యదనున నింటనుంట యశమా ? సరివారలలోన స్థానమా ?

కార్య :- (కోపముతో) ఆః! పారుబోతనజాలిన ధీరులుండిరిగా ? కార్యవర్ధిరాజు కఱకుకారి చురుకీ వదరుబోతులకు తెలియదేమొ — దేవీ ! వైళంబున నన్ను దీవించి పంపుము. జయభేరీ నినాదంబులు దశదిశాంతంబుల బ్రతిధ్వనింప—వైరి ధరాధినాధుల మస్తకంబు లా వినువీధి కెగసి ధరాస్థలిరాల—రణరంగంబు సర్వంబు రక్తధారాప్రవాహంబున మునింగిదేల ప్రళయ భయంకర మృత్యుదేవి ఈపానుగంటి పురంబుపై తేరి పార చూడకుండగను, విజయలక్ష్మి కటాక్ష వీక్షణము లా ప్రతిపక్ష రక్షకుల లక్ష్యంబు సేయకుండగను చేసివచ్చెదను.

నాగ :- (సంతోషముతో) శెహభాష్, నాధా! ఇపుడుగద నేను నిజముగ వీరపత్నినైతిని ? — నేడుగదా మీ చంద్రహాసంబు విధ్యుక్త ధర్మరక్షాదక్షత్వంబున స్వారాజ్య గౌరవ ప్రతిష్టల ప్రతిష్ఠించుకొను మహాదృష్టము నొందనుండె ? — ఈ నాడు గదా, అన్నలను మించిన తమ్ముడవై — మిట్టమధ్యాహ్న మార్తాండప్రతాప కిరణ ప్రసారంబుల దీపించుచు— శాత్రవా ఖండ దండనాధుల గుండెల బిండిసేయు దండధరులై వెలుంగ నుంటిరి ?

శార్య :- (నవ్వి) సఖీ ! సమయముగాని సమయమున సాహసప్రదర్శ నము సమంజసమగునా ? ఇదిగో, సందర్భము సమకూడినది— సమరసన్నాహంబులు సంసిద్ధమైనవి — సందేహమున కింక సావకాశము లేదు నాగూ !

గీ॥ నొసట కస్తూరి తిలకంబును సరిదిద్ది
దివ్యకర్పూర హారతిన్ దీవెనిమ్మ !
నాగపతి వాక్ప్రభావమో, నా సతీ ప్ర
బోధనానంత బలమొ - రిపుల జయింతు.

నాగ :- అంతకంటె వాంఛనీయమగున దేమున్నది నాధా ! శీఘ్రం బుగ వెళ్ళి విజయశ్రీ సమేతంబుగ తిరిగిరండు (భర్తముఖమున కుంకుమ బెట్టి — హారతినిచ్చి )

సీ॥ పదినూరు శిరముల ఫణిరాజు రణభూమి
పరికించి మిమ్ము గాపాడుగాత !
మన పానుగంటి సామ్రాజ్యలక్ష్మి కృప
తమ భుజస్కంధాన దనరుగాత !
మాన్యులౌ మా యుత్తమామల వాక్శుద్ధి
శంఖునాదము మీకు సలుపుగాత !
గగనవీధిని నిల్చి గంధర్వులే జయ
భేరి మీాదంచు విన్పింత్రుగాత !

గీ॥ నా సుమంగళీ దార్ఢ్య ఘనప్రభావ
మాయురారోగ్య వైభవ్య యశము లొసగి
కవచమై శాత్రవులనుండి గాచుగాత !
రణమునకు పోయిరమ్మా ! నా ప్రాణనాథ !

కార్య :- అలాగుననే వెళ్ళివచ్చెదను. (ఒరనుండి కత్తిని లాగి మూడు గీతలుగీచి) బాల! ఈ గీతలెందులకు గీచితినో నీకు తెలియునా ?

గీ॥ మంత్ర తంత్ర విద్యలలోని మర్మమెల్ల
కాచి వడగట్టి త్రాగిన గారడీడు ;
కాంతలను బల్మిచే బట్టు కాముకుండు,
దుష్టుడు-మరాఠి-కలడంత దూరమందు.

మా యేడ్వురు సోదరులయం దొక్కరమైన నింటిపట్టున లేకుండ యుద్ధభూమి కేగుచున్నాము. ఆ మాయలమారి యీ సమయ మెఱింగి మిమ్మేమయిన మోసగించునేమొ ? ఏదియెట్లైనను నీ వీ మాట మరువక వర్తింపుము.

ఉ॥ ఏనిట గీయుగీటు తగదే సమయంబున దాటిపోవ, నా
యాన దొలంగు నత్తరి ప్రయాసలబా లగుదేమొ ? కాన, నో
చాన ! యిదే సురక్షణకు చాలిన మార్గము విశ్వసించి, యే
మైన పదంబు బైటిడక హాయి మెలంగుము మందిరంబునన్.

పరాకుబడి ప్రమాదముల పాలగుదువేమొ —— ?

మ॥ ఇదియే రక్షణ నీకు ! నాదు హిత మేదేకాని భక్తిన్ చరిం
చెదవేనిన్ మన పానుగంటి పురలక్ష్మీ దేవి నిన్ గాచు గా
త దివారాత్రము లేలుగావుత - ఫణీంద్రస్వామి నిన్నోమ్ముగా
త - దివంబందుగలట్టి నీ జనని శ్రద్ధన్ జూచుగాతన్ సతీ !

(తెరవంక చూచి సంతోషముతో) ఓహో ! ఎంత సత్వరంబుగ నా సమర సన్నాహంబు లన్నియు సమకూరినవి ?

గీ॥ అదె రథంబు, జయపతాక మల్లదే; జ
యజయ భేరీ నినాదంబు లవిగొ; అదిగొ
సేన, శంఖారవమదిగొ - శీఘ్రమింక
నరుగువాడ - పగరుల నే నరుకువాడ,

(నిష్క్రమించును.)

నాగ:- (సంతోషముతో నాగేంద్రునకు నమస్కరించి) దేవా! మహానుభావా! మమ్మీ సమయంబునందును కాపాడుము.

సీ॥ భూదేవి మాయమ్మ పుత్రికాభిక్ష న
ర్థింప నొసంగిన దివ్యకరుణ;
నెరజాణ యైన మాణిక్యాలదేవి — కు
త్రలనుండి కాపాడ గలుగుకరుణ;
నట్టడివిని జిక్కి రొట్టుబడెడు మాకు
మేనమామల జూపు మేటికరుణ;
మా యక్కచెల్లెంద్రమా యేడ్వురను రాజ
పత్నుల నొనరించు పరమకరుణ;
గీ॥ నాడు నేడనకుండ యేనాడుకూడ
వీడిపోక మమ్ముల నేలు విమలకరుణ;
పానుగంటిరాజులయందు బర్వజేసి
యేలుమయ్య! కయ్యమున నాగేంద్రదేవ!

(తెర జారును.)

# బాలనాగమ్మ

## (ద్వితీయాంకము)

### మూడవరంగము-మరాఠిసీను

( ప్రదేశము: మరాఠికోట- అన్నివైపుల భూతాలు వుంటాయి. వాటిముందు బూడిద కుప్పలు కుప్పలుగ పోసి వుంటుంది. మహాకాళిలాంటి పెద్ద బొమ్మ యొకటి కట్టబడి యుంటుంది. దాని ముందు నిప్పులకుంపటి ఉంటుంది - మరాఠి లావైన కను బొమ్మలు భీకరమైన మీసాలు ముఖాన కుంకుమబొట్టుపెట్టి-దండ చేతులకు బొమికలు కట్టి మెడలో తాయిత్తులు గవ్వదండలు వేసికొని వుంటాడు. గుగ్గిలంగాని, సాంబ్రాణి గాని గుప్పిటతో బట్టి మధ్య మధ్య నిప్పులమీద చల్లుతుంటాడు. మంత్రాలు చదువు తుంటాడు. ఒక బల్లమీద కాపాలి యను బొమ్మ దాని ముందు మంత్రదండ ముంటాయి. తెర లేస్తుంది. )

మరాఠి:- జై మహాంకాళి భగవతీ! మళయాళ భగవతీ! మంత్రాల పుత్రి, తంత్రాలమత్రీ! మాయలమరాఠీ పిలుస్తున్నాడు మాటాడు భగవతీ! ఓం-హ్రీం-క్లీం. ( సాంబ్రాణి కుంపటిమీద చల్లును. కుంపటిలో మంటలు మండును. అది చూచి వికటముగ పెద్దగ నవ్వుచు) అహ్హాహ్హాహ్హా! మాయలమరాఠి పిలుస్తున్నాడు మాటాడు భగవతీ! ఓం-హ్రీం-క్లీం (మళ్ళీ సాంబ్రాణి చల్లి) అహ్హాహ్హాహ్హా! అహ్హాహ్హాహ్హా! మాయలమరాఠి పిల్తున్నాడు మాటాడు భగవతీ!! ఓం - హ్రీం - క్లీం ( మళ్ళీ సాంబ్రాణి చల్లి ) అహ్హాహ్హాహ్హా! అహ్హాహ్హాహ్హా! అహ్హాహ్హాహ్హా! కాపాలీ!

కాపాలి:- ఏం కావాలి?

మరా:- మరాఠి పిలుస్తున్నాడు - మాటాడు కాపాలీ!

కాపా:- మాటాడుచున్నాను మరాటీ!

మరా:- ఈ మరాటి దీక్షలన్నీ యీనాటితో అయ్యాయికదూ?

కాపా:- అవును - ఐనవి.

మరా:- ఈ మరాఠీకి దేవి వర మిచ్చిందికదూ ?

కాపా:- ఇచ్చింది.

మరా:- మరాఠికెప్పుడూ మరణం లేదుకదూ ?

కాపా:- లేదు.

మరా:- మంత్రాలు తంత్రాలన్నీ యెలా మాయమయ్యాయి కాపాలీ?

కాపా:- మహాంకాళి నీ కిచ్చిన మంత్రదండములో నిలిచిపోయాయి నీకు వశమయ్యాయి మరాటీ !

మరా:- నా మంత్రదండం మరొకరడిగితే నాయనుమతిలేనిదే ఇస్తావా?

కాపా:- కాపాలి ముందున్నదానిని కరకంతుడైనను సరే, కాలకాలుడైనా సరె కడచేరరారు - కన్నెత్తి చూడలేరు.

మరా:- కాపాలీ !

కాపా:- ఏం కావాలి ?

మరా:- ఈ మరాటికి ఈనాటినుండి యెవ్వరిచేతిలో, యే యాయుధానా, యేనాడూ, యెచ్చట మృత్యువు లేదన్నమాట ! సత్యమేకదూ ?

కాపా:- అధర్మపథంలో అడుగిడకపోతే మరాఠి శాశ్వతంగ మరణాన్ని జయిస్తాడు, జయించాడుకూడ.

మరా:- ( సంతోషముతో ) అహ్హాహ్హాహ్హా ! లేదు మృత్యువులేదు- మరాఠి కింక మృత్యువులేదు. అహ్హాహ్హాహ్హా ! అహ్హాహ్హాహ్హా మరాటీ నీవు మృడానిని మెప్పించావు - మృత్యువును జయించావు. అహ్హాహ్హాహ్హా ! సంగూ సంగూ !!

( సంగు డ్యాన్సుచేస్తూ ప్రవేశము )

## కీర్తన-1

మరా:- ఆటపాటల మిఠారీ! అందచందాల కొఠారీ! చిందులు వేయక రావే చిన్నారీ! (అని పట్టుకొనబోవును)

సంగు:- (దూరముగ తొలిగి వొయ్యారంగ నిలుచుని) ఏసినయెత్తు చిత్తయిపోయిందిరాజా! ఒట్టిమాటలతో యీ పిట్టచిక్క దండీ! చక్కని దొరగారూ! ప్రక్కకు తొలగండి, యీ సంగూదేవిగారు సరాసరి వెళ్లుతారు.

మరా:- గడుసుతనమున మిడిసిపడి గర్వభంగమందకే గమ్మళ్లసంగూ! పిట్టచిక్కటం-బుట్టలోపెట్టటం యెన్నడో జరిగిపోయిందే వన్నెలాడి. అహా! అయినా రెక్కలూడిన పిట్టకు నిక్కులెక్కువ కదూ? టక్కిరి బిక్కిరి తక్కెడబొమ్మ! పక్కననవ్వి పలుకవే పసిడిబొమ్మా!

సంగు:- (మరింత సగర్వముగ) మరాఠివారి మహాలులోపల, చక్కని చుక్క — చక్కెరముక్కయిన సంగూదేవి కొంగుకైనా రెక్కలూడవు—చిక్కులుండవు పలికిన పలుకులు తెలుసుకున్నావా? తెలుసుకున్న తెలివితో మసలుకొంటావా రాజా!

మరా:- మాటకుమాట — వేటుకువేటు నూటిగ నేర్చావె సుందరాంగీ! బదులుకూత కూశావటే బంగరుకోడీ!

సంగు:- కూత నేర్చని కోడిపెట్ట పేటకువస్తుందా? పోటీలుచేస్తుందా?

మరా:- గమ్మళ్లసంగుకీ గర్వమెందుకో?

సంగు:- నాగర్వముకాదు —సింగారాబము.

మరా:- గారాబానికి కారణము?

సంగు:- సాటిలేని సంగు సౌందర్యాతిశయమే

మరా:- అహ్హాహ్హాహ్హా! అహ్హాహ్హాహ్హా!

సంగు:- (విసుగుగా) ఏమిటానవ్వు?

మరా:- నీమాటలకు నవ్వటం నేరమంటావా? నిజం చెప్పావే నెరజాణా! నిజంచెప్పావు. కరకులేనిమగవాడు గరికకైన కొరగాడు. అహ్హాహ్హాహ్హా! సౌందర్యవతి- సాటిలేని సౌందర్యవతి సంగు సాటిలేని సౌందర్యవతి.

సంగు:-(కోపముతో) మరాటీ మాటలు........

మరా:- మరియాదను మీరుతున్నాయా ?

సంగు:- మనసును చాల మథనపెట్టుతున్నాయి రాజా! వేళాకోళపు మాటలతో విసుగుపెట్టక నిజమైన మాట నీనోటితో చెప్పు. నాకంటె నందగత్తె లీ నరలోకంలో వున్నారంటావా?

## పాట:

మరా:- అందాలకు హద్దులు దిద్దే సుందరాంగనలు వందలకు వందల మంది వసుధమీదనున్నారు. కావాలంటే కాపాలినడుగు-ఎక్కడున్నారో చూపుతుంది — ఎవరున్నారో చెపుతుంది. (సంగు రెక్క బట్టుకొని కాపాలి ముందుకు లాగి ) కాపాలీ !

కాపా :- ఏం కావాలి ?

మరా :- గద్దరించే గమళ్ళసంగుకు బుద్ధి వచ్చేలాగ ముద్దులగుమ్మ యెవరో ముందు చూపెట్టు.

కాపా :- ప్రక్కకు తొలిగి పరకాయించండి. కనుపిస్తుంది. కార్యవర్ధి యిల్లాలు. పానుగంటి నగరపురాణి—పరమపతివ్రతాశిరోమణి భారతీయనారి—బాలనాగ మ్మదిగో.

(మరాటి. సంగుప్రక్కకు తప్పుకొనుచుండ వెనుక తెరలేచును ఉయ్యాల లూపుచు పాటపాడుచున్న బాలనాగమ్మ కనుపించును. )

## పాట:

(మళ్లీ తెరవ్రాలుతుంది-సంగు మరాటీ స్టేజీమీదికి వస్తారు)

మరా:- అందమంటె యేమిటో అర్థమయిందా సంగూ! అదికలకల లాడే చిలకలరాణి— నీవు గునగునలాడే గువ్వపిట్టవు. అదిమరాతి మనసుకెక్కిన మహాదృష్టదేవత—నీవు నా మనోపీఠమునుండి జారిపోయిన దరిద్రదేవతవు. అదికాబోయే నా కోటకింక మహా రాణి—నీవు కాబోయె నామహాలులో పరిచారికవు. పలికిన పలుకులు తెలుసుకున్నావా? తెలుసుకున్న తెలివితో మసలు కొంటావా రాణీ!

సంగు:- ( ఆశ్చర్యముగ ) ఆఁ! అదేమిటి?

మరా:- ఏమిటో తెలియలేదా?

సంగు:- తెలియకపోవటమేం? తెలిసింది. నీవా బాలనాగమ్మను ప్రేమించావని—పచ్చని వారి కాపురంలో చిచ్చుబెట్టపోతున్నా వని నాకు బాగ తెలిసింది. ఇక తెలియవలసింది నీకు......

మరా:- నీకు తెలిసింది-నాకు తెలియనిది యీ ప్రపంచంలో లేదన్న సంగతి నాకు తెలుసు-నీకు తెలియదు. ఇపుడు చెప్పు. వేరే నాకంటే అందకత్తెలు లేరని విఱ్ఱవీగావు — అపరూపరాసి నని అదిరిపడ్డావు. నిను మించిన సుందరు లున్నారని నీకిపుడైన తెలిసింది.

సంగు :- ఇంతవరకు తెలియని నా కా విషయ మిపుడు తెలిసిందికాని ఇపుడు నీకు తెలియని సంగతి యింకొక టున్నది.

మరా :- ఏమిటది?

సంగు :- పానుగంటిపురపు రాణి పతివ్రతాశిరోమణి. అగ్గివంటి యిల్లాలి నాసించుట అకాలమృత్యువున కాహుతి యగుట. మహాసాధ్వీ లలామపై మమకారం మంచిదికాదు.

మరా:- ఆహ్హాహ్హా! మహాసాధ్వి! ఆమె మహాసాధ్వి! ఆ బాల నాగమ్మ మహామహామహాసాధ్వి. మహాసాధ్వి అంటే మన అర్థమేమిటో తెలుసా? ఒకేభర్తకు పెళ్లామయితే సాధ్వీమణి మని సమాధానపడుతాము. మహాసాధ్వి యనిపించుకోవాలంటే

మరొొక మగడుండాలే పిల్లా ! ఏయ్ ! సంగూ ! పొంగిపడక లొంగిరావే పోకిరిపిల్లా ! అడిగినదానికి బదులు చెప్పవే వయ్యారిభామా ! నీమీాద నా కన్నుబడకముందు నీవుకూడ వొక మహాసాధ్వీలలామ వేకదూ ?

సంగు :- కావచ్చును. ఆమె భర్త అసహాయశూరుడు—బావలార్వురు బలాఢ్యులు — పోతుటీగయేనియు వారి కోటలోనికి పోలేదు; పోయినచో తిరిగి రాలేదు.

మరా :- అహ ! అదా కథ ? నీ సందేహానికి నా సమాధానం - ఆమె భర్త అసహాయశూరుడు, బావలార్వురు బలాఢ్యులైనందుననా ఆమె మహాపతివ్రత ? అయితే బాలనాగమ్మ భయపడిన శీలవతియెకాని, మనోనిర్మలంగల మానవతి కాదన్నమాట ? అహ్హాహ్హాహ్హా ! ఇంక రెండవ విషయంమేమిటంటావా ? పోతుటీగయు వారికోటలోనికి పోలేదన్నావుకద్దా ? పోవటమే లేక పోతే తిరిగి రావట మెలావుంటుంది ? అంటే నీమాటమీాద నీకే నమ్మకం లేదన్నమాట.

సంగు :- మరాఠిమహరాజా ! మారర్థాలు తీయకు. మూార్ఖంగ నడిచితే ముప్పులపాలవుతావు. చేసిగడించిన తపస్సంతా నాశనమై పోతుంది. నిన్ను దక్కించుకోలేక నేను దుఃఖించాలి. నా ప్రార్థనలాలకించి నాగమ్మమీాద మమకారం మార్చుకోండి.

మరా :- ఎత్తులు పారవే జిత్తులమారీ ! సవతివస్తుందని సందేహించావు. — బాలనాగమ్మభర్త బలాఢ్యుడని భయపెట్ట చూచావు. ఆమె పాతివ్రత్య ప్రభావమును దెచ్చి అడ్డుపెట్ట చూచావు. మరాఠినే తేలికగామాయపుచ్చగలవా? మాటకారి ! మాయదారీ !

సంగు:-మగవారినరికట్టటం మగువుల తరమా మరాఠీ ! వసుప్రతాటికై ప్రాకులాడటం పన్నాగ మవుతుందా మారాజ! సుఖపడాలంటే సకియలు లేకపోయిరా ? కాని, నాగమ్మను ముట్టబోవటం

నాగుబామును పట్టబోవటమే. పానుగంటిప్రభువులు పౌరుష వంతులు. నిన్నేనాటికయినా నిర్మూలం చేయకపోరు.

మరా:- సాకులల్లావుకాని సాగనేరవు సంగూ! పానుగంటిప్రభువులు పౌరుషవంతులై న న్నేనాటికయినా నాశనం చేస్తారా ? అహ్హహ్హహ్హ! బాగాచెప్పావే - పిల్లా, బాగాచెప్పావే. ఇంకా నయం. ఉయ్యాల తొట్టిలో వూకొట్టుతు పవళించి యున్నాడే పసికూన —— ఆ పసిపాప నా ప్రాణాలు తీస్తాడన్నావుకావు.

సంగు :- ఏమయిన కాని యింకోమాటు చెపుతున్నాను. నాగమ్మను ముట్టబోవటము నాగుబామును పట్టబోవటమని మళ్ళి చెప్పి మానుకుంటున్నాను.

మరా:- నాగుబాము లేనాడో నా వశమైపోయాయి. మరాఠిచేతనున్న మంత్రదండాన్ని చూచి పడగనెత్తలేని పాము పగపట్టుతుందా? పట్టిపీకుతుందా ? కోడెత్రాచులనైన కోరలు పీకుతాను—— కోరిన పడుచులను తెచ్చి కోటలో పరికిస్తాను.

సంగు :- పరకాంతా వ్యామోహం పనికిరాదు మరాఠీ ! నమ్మకున్న సంగును నట్టేట ముంచకు రాజా !

మరా :- ( కోపముతో ) సంగూ !

సంగు :- (భయపడి దూరముగ బోవును.)

మరా :- బెదరిపోతున్నావటే పిచ్చిపిల్లా! ( వికటముగ నవ్వి ) రా ! దగ్గరకు రా ! దగ్గరకు వస్తే బిగ్గరగ వినిపిస్తుంది. క్రొత్తరుచులను మనసు కోరుకొంటుంది. పాతపెళ్ళాంమీాద రోత బుట్టిపోయింది. బంతిపువ్వులాగున్న బాలనాగమ్మ మరాఠి హృదయంలో మహారాణియై పోయింది. వారెవా ! వరాలకుప్ప - వజ్రాలతెప్ప. బలాత్కారంగనైన బాలను తెస్తాను. పెళ్ళాడమని ప్రేరేపిస్తాను. కాదంటే దాన్ని ఖైదీ చేస్తాను. అహ్హహ్హహ్హ!

బాలనాగమ్మ లేని బ్రతుకు వృథా! — వృథా జీవితం వ్యథా మయం. సారాంశమైన యీ జీవిత సారమేమిటో మనం సాధించాం. సాధించినదాని స్వరూపం సాంగోపాంగముగ శోధించాం.

సంగు :- శోధించాం—వేధించాం. సంసారం చేసుకుంటు సౌఖ్యంగ జీవించే బాలనాగమ్మను బంధిస్తాం — బాధిస్తాం. అంతేనా ?

మరా :- అంతేనే సంగూ! అంతే. అంతకాకుంటె మరెంత ? చిక్కిన జీవాన్ని చంపకుండ — మక్కువదీర మెక్కకుండ మెలుక ప్రాణాలమీద జాలిపడి యేపిల్లియినా వూరుకుంటుందా ? ఒదిగి తిరుగుతుందా ? మనంకూడ అంతేనని చెపుతున్నాం— చెప్పిన దంతా చేయబోతున్నాం. పానుగంటి పట్టణానికి ప్రయాణ మౌతున్నాం.

సంగు :- ( అడ్డము వచ్చి ) ఆగు మరాటి! ఆలోచించుకో. పతివ్రతల నెదిరించి పరమేశ్వరుడయిన జయించలేడు. ఆమె నీకు ప్రళయ దేవతగాని - ప్రణయ దేవతగాదు.

మరా :- (పెద్దగ) సంగూ!

సంగు :- ( బెదరి దూరముగ బోవును. )

మరా :- అహహహహ హాహాహా! అహహహహ హాహాహా!

( తెర వ్రాలును)

# బాలనాగమ్మ

## (తృతీయాంకము)

(పానుగంటి కోటముందు - విచారముతో కొత్వాలు)

కొత్వాలు:- పిల్లలు, పిల్లలు—పుట్టలేదు, పుట్టలేదంటే ఎలాపుట్టుతారు? చెట్టున కోసుకొని వచ్చేదా? పుట్టమీద యేరుకొని వచ్చేదా? నావల్ల తప్పు లేకుండ నానాతిప్పలు బడుతున్నాను. నాగుమయ్య పుట్టలో నాగుబాలు పోయించానా! నాంచారమ్మకు మ్రొక్కి నాలుగు కాళ్ళ జీవాన్ని బలిచ్చానా? — ఏడుకొండలవానికి ముడుపులు గట్టి యెదురు నడకలు నడిచానా? కోటేశుడికి ప్రభలు కట్టించి కొండకు వెళ్ళి వచ్చానా? కంచి కామాక్షమ్మ, మధుర మీనాక్షమ్మకు వరపడ్డాను — వడపప్పులు పంచాను. ఒంటిదోషమో, యింటిదోషమో నని వైద్యాలుకూడ చేయించా, ఉన్న పెళ్ళాముతో వుపయోగము లేదని వుపరిపెళ్ళాన్ని కట్టుకున్నాను. ఇద్దరు యేకమై యిపుడు నన్నేపుక తింటున్నారు. వాళ్ళిద్దరు — నేనొక్కడను. "పిల్లలెల్లాగయ్యా? పిల్ల లెల్లాగయ్యా?" అని పీక్కుతింటుంటే యేంచెప్పేది నా పిండాకూడు. ఆశలు వొదులుకొని అప్పటికి మానుకొన్నానా? గంగమ్మ చెప్పిన గచ్చవేరు — పుల్లమ్మ చెప్పిన పుచ్చవేరు తెస్తానే వున్నాను — తాయిత్తులు కట్టిస్తునే వున్నాను. కాకపోయినా — ఆ బ్రహ్మదేవుడికయినా కాస్త బుద్ధివుండవచ్చునా అంట? బిడ్డలో బిడ్డలో అనేవారికి బిడ్డలూ లేరు — గడ్డలూ లేవు. ఒద్దు మొర్రో అనేవారికి వంటినిండా పిల్లలె — యింటినిండా పిల్లలె.

(మరాఠి పకీరువేషముతో ప్రవేశము)

మరా:- హరహర మహాదేవ శంభోమ్. (శంఖునాదము చేయును)

కొత్వా :- ఏయ్! గంగెద్దువేషం! ఏందాగడిబిడ? మనుబోతులా పోతున్నావు — మనుష్యులు కనబడటం లేదా?

మరా :- (గంభీరంగ) బసవేశ్వరుని ప్రయాణమే భంగపరుస్తున్నావా కొత్వాలూ! నందికేశ్వరుడికే కోపం వస్తే నాశనం చేసి పారేస్తాడు. బాటతప్పుకుంటే నీవు బాగుపడతావు.

కొత్వా :- గంతా బొంతా గాడిదబరువు చూచి నందికేశ్వరుడవని నమ్మతామనుకొన్నావా? ముష్టికోసం వచ్చిన ముసలిపీనుగ బసవేశ్వరుడంట — బసవేశ్వరుడు. కొత్వాలును మోసగించి కోటలోనికి పోలేవు: దొంగవేషాలు మాని దోవపట్టుముందు.

మరా :- పట్టినపట్టు నేడైనా గట్టున పెట్టకుండ మధ్యలో విడిచిపెట్టడం మన కలవాటు లేదు కొత్వాలూ!

కొత్వా :- బడుగుజంగాలకు భయపడిపోయి మార్గం యిచ్చే లోటు మన కలవాటు లేదు జంగం!

మరా :- ఈ లోటు లేకపోయిన ఆ లోటు వున్నదిగా?

కొత్వా :- అంటే — ?

మరా :- అంటే! యింటిలో చంటిపిల్లలు లేనిలోటు

కొత్వా :- అంటే? —

మరా :- అంటే, దైవసములయిన మమ్ము ధిక్కరించిన లోటు

కొత్వా :- అంటే?

మరా :- అంటే — గతజన్మ ఫలితం — ప్రస్తుత జన్మలో మిళితం

కొత్వా :- అంటే?

మరా:- అంటే సంతానం లేకుండ సంతాప పడుతున్నావు.

కొత్వా:- అంటే?

మరా :- అంటే—రెండో పెళ్ళాడినా పండు పండలేదు.

కొత్వా:- అసలు రహస్య మదియా స్వామి? మన్నించండి. మన్నించండి. (కాళ్ళమీద పడును.)

మరా:- (తనలో నవ్వుకొని) కొత్వాలూ! మన్నించాను. కుచేలసంతతి నీ కిస్తున్నాను లే

కొత్వా:- ( లేచి సంబరముతో ) నిజముగానా స్వామి!

మరా:- నీవు కోరిన సంతతిని నిజంగానే నీ కిస్తున్నాను. అయినా నీకా అనుమాన మెందుకు? ఎంతమంది సంతు కావాలో యెంచుకొని చెప్పు కొత్వాలూ!

కొత్వా:- నా పెద్దపెళ్ళాం సినపెళ్ళాం నన్ను చంపుక తింటున్నారు. కడుపునిండిన సంతానం కలిగేలాగ వర మివ్వండి.

మరా:- కొత్వాలూ! మతిలో కోరుకొనవయ్యా! పిల్లల్ని కనాలిసింది పెద్దపెళ్ళాము చిన్నపెళ్ళాము వేగంగ చెప్పుకో - విబూతి యిస్తాను.

కొత్వా:- (కొంచ మాలోచించి, ఏమియు తోచక తలగోకుకొనుచు) పెద్దపేచీ తెచ్చి నా పీకమీద పెట్టారు స్వామి! పెద్దది పిల్లల్ని కంటుంటే చిన్నదివచ్చి నా చెవులు పట్టుకుంటుంది. చిన్నపెళ్ళాం పిల్లల్ని కంటుంటే పెద్దది వచ్చి నాపీక నులిమి వేస్తుంది. లేక ఇద్దరూ కనటం మొదలుపెడితే ఎడతెగని సంతాన మౌతుంది. అదిగాక - దేని బిడ్డ నెత్తుకోటం! దేనిబిడ్డను నడిపించటం? పెడదిరిగి మెడమీద పడేలాగుంటే? ఇన్నాళ్ళబట్టి పిల్లలు లేరని యేడిశాను. ఇయ్యాల తల్లెవరా అని ఏడిశాను. స్వామీ తిరకాసు బడ్డ వ్యవహారం తేమల్చండి మీరే.

మరా:- చెప్పినట్లు చేస్తావా?

కొత్వా:- మాటిచ్చి తప్పిపోవటం మన పని కాదు స్వామీ, పుట్ట బోయే బిడ్డమీద వొట్టెట్టుకోమన్నా బద్ధపడి సిద్ధపడతాను.

మరా:- పేచీలుపడే పెళ్ళా లెందుకుగాని, నీవే బిడ్డల్ని నిశ్చింతగ కనరాదూ?

కొత్వా:- అమ్మ బాబోయ్! అంత పనివద్దు. అలాగా ఆలోచించినా మగవారు బిడ్డలకనటం మనమెక్కడా కనలేదు - వినలేదు.

మరా:- మనమిచ్చే విభూతిలో వుంది మహత్తరమైన శక్తి. నీవేమిటి? నీ యింట్లోనున్న కంచాలు-మంచాలు; గూడులు-గోడలు; శరవాలు-బీరువాలుకూడ కొల్లలు కొల్లలుగ పిల్లల్ని కంటాయి. నిదర్శనం కావాలంటే నేడే కనుపిస్తుంది.

కొత్వా:- ఆశీర్వదించి ఇవ్వండిస్వామీ! అందరము పూసుకుంటాము. కావలసినంత సంతతితో నా యిల్లు కలకల లాడేలాగ.

మరా:- అభ్యంతరం లేకుండ ఆశీర్వదిస్తున్నాను. అల్లరి చేసే పిల్లలతో నీ యిల్లు ఘల్లుమనాలి- నీవళ్ళు ఝల్లుమనాలి. ఇదిగో విభూతి-యింటినిండ చల్లు ( యిచ్చును )

కొత్వా:- (తీసుకొని) దండాలుస్వామీ! దండాలు. ఒరేయ్ ఎవడురా అక్కడ! అయ్యగారి దోవకు అడ్డం చెప్పకండిరా! వెళ్ళిరండి స్వామీ! నేనూ వెళ్లుతున్నాను. (నిష్క్రమించును)

మరా:- (నిట్టూర్పుతో) అబ్బా! ఈ శనిగాడు యిప్పటికి వదలి పోయినాడు. రాచపడుచును పట్టటానికెంత రాద్ధాంతం జరగాలో? కానీ చూద్దాం. కాళికాంబ వున్నదిగా! (శంఖును పూరించి) భిక్షాందేహి! భిక్షాందేహి!! భిక్షాందేహి!!!

(తెరలో) అయ్యా! దాసి మీకు భిక్ష తెచ్చుచున్నది. దయచేసి కొంచె మోపిక పట్టుడు.

మరా:- (కోపముతో) ఆఁ ఏమేమీ? పరమేశ్వరునకా? పరిచారిక చేతి భిక్ష!

శా॥ లేరా, రాజకులాంగనామణులు? కేళీలోలురై భోగ వి
స్తారానంద మదాంధకారమున ప్రస్తావించుచున్ మెక్కుచున్
మా రాకన్ గమనించికూడ నిటులన్ మర్యాదలే కీ యహం
కారమ్మా? పరిచారికన్ బనిచి భిక్షాదాన మిప్పింపగన్?

(బాలనాగమ్మ భిక్షతో ప్రవేశించును.)

నాగ:- మహాపరాధం, మన్నించండి. అనుగ్రహించి భిక్షనందుకోనండి.

మరా:- (వినిపించుకోనక--తనలో) ఆహా! ఏమి యీామె లావణ్యము

ఉ॥ కీరితి చిత్రకారులు లిఖించుచుటగా కిటువంటి సుందరా
కార లతాంగు లుండరని గల్గిన సంశయమెల్ల నేటితో
దీరగ కానుపించిన సతిన్ సుఖయింపగ నొక్క జన్మలో
నేరుచు నా తపంబు తగునే ? గతజన్మఫలంబు లేనిచోన్.

నాగ:- అనుగ్రహింపక నాలోచించుచున్నారేమి ? క్షమాభిక్ష నర్థించి
నను క్షమించి భిక్షాదానము పరిగ్రహింపరా ? కొద్దినేరమున
కింత కోపమా, మహాత్మా!

మ॥ పురిటింటన్ పసిబిడ్డడొక్క గతిన్ పోర్వేట్టి వాపోవ; తొం
దర కార్యంబున అక్కలార్వురును వద్దన్ లేని సందర్భ మం
దరయన్ జాగగు నన్న భావమున నే నట్లంటి నేగాన - నన్
కరుణాదృష్టి జెలంగ నే నొసగు భిక్షన్ గొమ్ము మన్నించుచున్.

మరా:- శాంతించితిని. సమీపించి బిక్ష నొసంగుము. (కొంచెమాగి)
అనుమానిస్తున్నా వేం ?

నాగ:- మహనీయా! ఆ గీటు నేను దాటరాదు. నా నాథునియాజ్ఞ
పాలించుట నా విధానము. దయయుంచి తమరే యిటు దయ
చేయండి.

మరా:- మగువలకు విధించిన ఆంక్ష మాబోటివారు దాటరాదు.
పిచ్చిదానా! నీ భర్త నీకుమాత్రమే నాథుడు - కాదా, యీ
పానుగంటి పట్టణంబునకు నాథుడు కావచ్చును. కాని, నేనో?
నిఖిల చరాచరమయధరాతలంబెల్ల శాసించగల గౌరీనాథు
డను. కార్యవర్ధియే యిపుడిందున్నచో కాదని నాయాన మీార
గలడా ? బసవేశ్వరు నారాధించుటకు భక్తితో భిక్షనందించు.

నాగ:- అయ్యో!

ఉ॥ నాథుడు; కార్యవర్ధినరనాథుడు; నా కనుదోయికిన్ రతీ
నాథుడు; బాలనాగు కధినాథు డొసంగినయాజ్ఞ మీార నో

సాధువరా! పతివ్రత నిజస్థితి నారయ నెన్నడేని త
న్నాధు నన్నుజ్ఞ మీరు టిల న్యాయమటందురే పెద్దలెయ్యోడన్.

మరా:- ( మహాక్రోధముతో )

శా॥ ఏమేమీ? భయమింతలే కిటుల నాకే చక్కటుల్ దిద్దు మేల్
సామర్థ్యంబు గడించినావె? పతియాజ్ఞాపాలనం బెంచి,
మ్మిమ్మాడ్కిన్ నిరసింప బూనితివె? నీవేగాక నీ నాధుడున్
మీ మేల్పట్టణమెల్ల భస్మమగు సుమ్మీ! నేను కోపించినన్.

రా! ఇవతలకురా! భండనభూమి నున్న నీభర్త బ్రతికి యింటికి రావటం నీకిష్టము లేదా? పురిటిలోనున్న నీబిడ్డ పెరిగి పెద్దవాడగుట నీ కోరిక కాదా? పానుగంటిసామ్రాజ్యము ప్రశాంతముగ నుండుట నీవు చూడలేవా? మాకు మహాగ్రహం రాకముందే మీకు శాప మివ్వకముందే భిక్ష నిచ్చి రక్షించుకొంటావో? – నీవు, నీభర్త, నీ బిడ్డ నీ బాంధవు లందరితోగూడ భస్మీభూతమై పోతారో ఆలోచించు – అడుగు ముందుంచు — ఆ భిక్ష నాకందించు–ఆపద నివారించు–అందరిని మెప్పించు. రా! అనుమానించక రా! ఆలస్యం చేయక రా! రా!

బాల:- చిత్తము. ( భయపడుచు మెల్లమెల్లగ అడుగులు వైచుచుండ మరాఠి శంఖు పూరించును. ఆ ధ్వని వినలేక చెవులు మూసికొని పడిపోవును. మరాఠి మంత్రదండమును చూపుచుండ తెర వ్రాలును. )

కొత్వాలు:- మోసం. మోసం. అంతా మోసం. పచ్చిమోసం. ఎంత పని జరిగింది? ఎంతపని జరిగింది? ఘోరం. ఘోరం. ఘోరమంటే ఘోరమా? పచ్చిఘోరం. నిక్కచ్చి ఘోరం. మాయదారి ముండాకొడుకు మా కొంప తీయటానికే వచ్చాడు. మంచి మంచి మాటలు చెప్పితే మర్యాదస్తు డనుకొన్నాను. ఆ మంత్రమేమి మంత్రమో–ఆ తంత్ర మేమితంత్రమో పిల్లలంటే పిల్లలా? కుండల్లోనుంచి పిల్లలే – కుదుట్లలోనుంచి పిల్లలే. పొయ్యిలో

నుంచి పిల్లలే - పొంతల్లోనుంచి పిల్లలే. అమ్మ దేవుడా ! నల్లులైనా నయమనిపించినాయి' నలిపి పారేద్దామనిపించింది. మాట వరుసగ అన్నాడనుకొన్నాను గాని మా ప్రాణాలు తీస్తాడనుకొన్నానా ? బంగారంలాంటి తల్లి బాలనాగమ్మను యెత్తుకపోయాడుగందా ? యుద్ధానికి పోయిన మా పానుగంటిప్రభువులు వచ్చి అడిగినచో నేమని చెప్పుదును ? అరుగో అనుకొనుచుండగనే చిన్నాయనగారు చేరవస్తున్నారు. బాట తప్పుకొని సమయంలో బైటపడుతాను. ( నిష్క్రమించును. )

( తెర లేచును. కార్యవర్ధిరాజు ప్రవేశము. )

కార్య :- ( నలువైపుల చూచి సందియముతో ) ఏమది చెపుమా ! ఎన్నడూ లేని యీ కళావిహీనంబునకు కారణమేమి ? చింతాక్రాంత మైన చెలియమోముచందంబున శ్రీలుజలంగు మా రాజాంతః పురమింత చిన్నపోయిన దేల ?

గీ॥ కానబడదు నైజంపు శృంగారమేమి ?
వినగబడదు విధానంపు విజయభేరి ;
జయసమేతులమైన మా సౌధసీమ
శోభ బాయంగ నేల ? యీ శోకమేల ?

వాటన్నిటి మాటకేమిగాని, నాబాల కానరాదేల ? కడసారి కొక్క దాసియేనియు కనుపించ దేమిచిత్రము ?

సీ॥ ఎదురేగుదెంచి నా పదముల సేవించు
నసమానశీల ; ముత్యాలబాల ;
పరిహాసమున కేని పాడిదొలంగని
సద్గుణలోల, వజ్రాలబాల ;
పతియాన స్వయముగ పాటించి సేవించు
ననుపమశీల, నెయ్యాలబాల;
మాట వరుసకైన మాత్సర్య మెరుగని
నఘునవిశాల, రత్నాలబాల ;

గీ॥ సైపలేని దుఃఖానల జ్వాల గూలి
మనసిజానేక శస్త్రంపు మొదల దూలి
తీవ్రపరితాప జలరాసి దేలువేళ
బాల, రాదేల ? నేడింత జాలమేల ?

(ఆలోచించి) ఓహో ! అర్థమైనది. యుద్ధంబున గండికోట రాజుల మర్దింపకయె తనమీది మమకారంబు పెంపున మా యన్నల వీడివచ్చి యుందునని బాలనాగీ విధంబుననాపై నలుక వహించి మానమూనుటయెగాక పరిచారికలను సైతము పల్కరాదని యాజ్ఞాపించి యుండనోపు. లేకున్న నా బాలయేమి ? నా పిలుపునకు బదులాడకుండుట యేమి ?

శా॥ బాలా ! సందియమందనేల ? రిపురాడ్వర్గంబు సర్వంబు ప్రా
ణాలన్ నిల్పుకొనంగ నేగుతరి నన్నల్ నేను చండాడినా
మీ లక్ష్యంబున వీరపత్నులన మీకే చెల్లెనింకన్, సరే
నా ? లాలింపగ రమ్మ వేగ నను నానందాబ్ధి దేలింపగన్.

(కొంచెమాగి రోషముతో) రాజాంతఃపుర వాసులారా ! బాల నాగెక్కడ ?

కొత్వా :- (ఎదురేగి నమస్కరించి) మహారాజా ! జయమగుగాక.

కార్య:-(తనలో) కొత్వాలుముఖవైఖరి కొత్తగనున్నదే(ప్రకాశముగ) బాబా ! కొత్వాలూ ! వాక్యము చూడ వైభవమును, వదనము చూడ వ్యాకులతను సూచించుచున్నవి. బాలనాగు కానరాకుంటకు బలవంత కారణమేమొ క్రమముగ చెప్పుము.

కొత్వా:- (దుఃఖించుచు) మీరురణమునకు బోయిన మూడవనాడు...

కార్య :- (భయముతో) మూడవనాడా ? మూడవనాడు. ముప్పే మయిన మూడినదా ? చెప్పు — కొత్వాలుబాబూ ! చెప్పు.

కొత్వా :- ముప్పేమిలేదు. ముత్తెమువంటి మగబిడ్డను కన్నది.

కార్య :- ప్రసూతి జరిగిందా ? ప్రమాదమేమి లేదుగదా ? తల్లీబిడ్డ లింతవరకు చల్లగ నున్నారా ?

కొత్వా :- ఆయువు లోపము లేని ఆయుష్మంతులే మహారాజా !

కార్య :- (నిదానించి) పోనీ, వ్యాధిచే నేమయినా బాధపడుతున్నారా?

కొత్వా :- ఆరోగ్య లోపము అసలే లేదు మహారాజా !

కార్య :- మరి అంగవైకల్య మేమయిన సంభవించినదా ?

కొత్వా :- ఆనవాలుకునైన అగుపించవు రాజా !

కార్య :- అయితే సంతోషించక సంతాపపడతా వెందుకు ? యుద్ధములో మనకే జయం సిద్ధించినదికూడ కొత్వాలూ! నీ నేత్రము లశ్రుపూరితములై యున్నవి. ఆనంద బాష్పాలా ? దుఃఖ బాష్పాలా ?

కొత్వా :- (ఏడ్చుచు) మాయలపకీరు మారువేషంలో వచ్చి — మమ్మందరిని మోసగించి మహారాణిగారి నెత్తుకపోయినాడు రాకుమారా !

కార్య :- హా ! (నేలమీద చతికిలబడును)

కొత్వా :- (పట్టుకొని) మహారాజా ! ఊరడిల్లుము

కార్య :- (కోపముతో చివాలున లేచి) ఓరోరి దుష్టమరాఠీ ! ఎంత నీచపని చేసితివిరా ?

ఉ॥ అందర మింటలేని సమయంబున దొంగతనాన వచ్చి, నీ
మందులు మాకు లేవా వొక మానిని పై నిడి తస్కరించు — నీ
బొందిని ముక్కముక్కలుగ పూని వధింపక కార్యవర్ధిరా
జెందు మెలంగినన్ విడువడింక నినున్ రణరంగమందునన్.

కొత్వాలుబాబూ ! కోటలో వాడు దూరుచుండ నుద్దండులైన మీరంతవరకు నిద్దురపోవుచున్నారా ? పికిపిందల చందంబున పరువులెత్తి ప్రాణాలు దక్కించుకొన్నారా ? చిన్నరాణిగారి నొక చెనటి చెరబట్టుక పోవుచుండ ముంజేతులకు గాజులు దొడిగించు కొని మూలకూరుచున్నారా ? పానుగంటి పట్టణపురాణి పరాధీన యగుచుండ గుడ్లు మిటకరించి చూస్తూ కూరుచున్నారా ?

మీ గుండెలు బండపారిపోయినవా? మీ కత్తి పదును రిత్త పోయినదా? మీ పౌరుషము పాడయినదా? మీ వేడి రక్తమునకేమయిన శీతలము గ్రమ్మినదా? బాలా! బాలా! (మూర్ఛపడును).

కొత్వా:- మాలదైవమా! మాపై నీకీపగేల? చిలకా గోరువంకల లాంటి దాంపత్యంలో చిచ్చుపెట్టావేమయ్యా? రాజా! ఊర డిల్లుము. దొంగవేషములో రాబట్టి దోవనిచ్చితిమి కాని నిజ రూపంలో వస్తే నే నూరుకుంటానా? చిన్నరాణిగా రా మోసములో చిక్కుబడుతారా?

కార్య :- (మెల్లగ లేచి) హా! బాలనాగూ!

గీ॥ మధుర మధురరసైక దాంపత్యమందు
హాయి - ప్రేమడోలికల నుయ్యాలలూపి
తనియచేసి లాలించు నర్ధాంగ లక్ష్మి
బంధపడి పోతె దుష్టుని పన్నుగడల?

కుమారు డెటులుండెనయ్యా కొత్వాలుబాబా!

కొత్వా :- ఆర్గును పెదతల్లు లరచేతులలో పెట్టి పెంచుతున్నారు మహా రాజా! ఆనాటినుండి యీనాటివరకు వారి కన్నీటిధార కట్టు బడలేదు ప్రభూ!

కార్య :- అవును వారుమాత్రి మెటులూరట నొందుదురు? బాలు డింతకు భద్రంబుగ నున్నటులేకదా?

కొత్వా :- కుమారులవారికి కొరతలేదు మహారాజా!

కార్య :- పురిటిలోనే మాతృకొరతతో బుట్టిన దౌర్భాగ్యున కేకొరత లుండియేమి? లేకుండియేమి? ఓయీ! బాలకా!

శా॥ ఏనక్షత్రమునందు బుట్టితివో కానీ, గర్భమందున్న నా
డే నీయయ్యలపై ఘటించె రిపుధాత్రీశుల్ మహాయుద్ధ మ
ద్దానిన్ గెల్చితి మెట్టులో - జననమందన్ నేడు నీతల్లి క
ట్టా! నీచాంధులచేత జిక్కెనపురారా! నిష్టదౌర్భాగ్యుడా!

కొత్వా :- మన తలవ్రాతకు మన మనుకొనవలయునుగాని, అశుభము శుభము దెలియని ఆ పసిపాప ననుకొందులకు ప్రభూ !

కార్య :- ఆ పురిటికందువు ననటం నా పొరపాటే. నెలదాటని పసిపాప నేరమేమి చేసెనని నిందించవలయును ?

గీ॥ పూర్వ జన్మమున దెవరి కాపురము భంగ
పెట్టి నవ్వినాడనొ - నేటికిట్టులేను
మన్మనోహరి నెడబాసి క్రుమ్మచుంటి
పాపననుట మరింత పాపంబుచేటు.

పలవించిన మాత్రమున ఫలమేమున్నది ? గతమును మరచి గత్యంతర మేదియొ చెప్పుము కొత్వాలూ !

కొత్వా :- మరాటిబారినుండి మహారాణిగారిని విడిపించడమే మన కర్తవ్యము.

కార్య :- అవును

గీ॥ బలపరాక్రమ తేజోప్రభావులైన
బావలార్వురు - పతి కార్యవర్ధివిభుడు
రాగలారు - బిరాన మరాటిని వధి
యించి తను గాచునంచు లోనెంచుబాల.

బాల :- ( ఆలకించి రోషముతో ) ఏమాకలవరము ? ఎవరో దురాత్ములు సమయ మెరింగి మాపై సమరము సేయువచ్చుచున్నారా ? కాకున్న నా రణగణ ధ్వానములేమి ? — ఆ రథంబుల బరువులేమి ? — గజబలగంబుల ఘీంకారము లేమి ? కాల్బలముల కల్లోలమేమి ? ( కత్తిని దూసి ) ఓరీ ! స్వార్థమాత్రానంద స్వాంతులారా ! స్వధర్మ పరిత్యాగపారాయణులారా ! రండి. కయ్యంబున మాచే జయింపబడిన గండికోట భూనాధుడవో ? మా రాజాంతఃపుర స్త్రీల నపహరించి

నది చాలక మము నిర్జింప నేతెంచుచున్న మరాటివా కాని నీ కాయువు నేటితో మూడినది, రారమ్ము.

కొత్వా :- తొందర నొందకుము రాజా ! వారు మన ప్రభువులుగాని పరాయివారు కారు, అవి మన సేనలుగాని పరసేనలుగావు. సోదరులు మీా కనుకూలురుగాని ప్రతికూలురు గారు. మరాటి మనకు చేసిన మహోపకార మెరింగి రాణిగారిని రక్షించుటకై రణంబున మీాకు సాయము వచ్చుచున్నారు.

కార్య :- ఆలాగా ? అన్నగారలయం దెంత అమానుషముగ ప్రేలితిని ? సరికాని కొత్వాలుబాబూ ! మాంత్రికునితో పోరాటము మహాభయంకరము. జయాపజయములు దైవాధీనములు గదా ! విజయంబుగ తిరిగివత్తుమా మంచిదియె, కాకున్న నా పురిటిబిడ్డకు బాలవర్ధి యను నామకరణము గావించి — రాజ కుటుంబమున నీ భక్తిశ్రద్ధల వినియోగించి వాని బెంచి రాజ్య పట్టాభిషేకంబు గావింపుము. నేనింక శీఘ్రుంబుగ వెళ్ళివచ్చెద. ( కోపముతో ) ఓరోరీ ! తస్కరాధమా !

శా॥ హోరాహోరి విరోధి భూధవులతో నొప్పార బోరాడి, దూ
ర్వారానంత పరాక్రమంబున మహార క్త ప్రవాహంబు వే
పారన్ శత్రుశిరంబులన్ దునిమి నా వజ్రాయుధం బింక హా
హారంబుల్ విడనాడ దోరి నిను సంహారంబు గావింపకన్.

( నిష్క్రమించును )

# బాలనాగమ్మ

## (చతుర్థాంకము)

( మారాటీ మహలులో బాలనాగమ్మ - సంగు )

బాల:- సరిగ చెప్పవమ్మ సంగమ్మ తల్లీ ! ఈ మాయముండాకొడుకు నన్నెందుకు తెచ్చాడు ? ఎపుడు వదిలివేస్తాడు ?

సంగు:- నీప్రాణా లుండగ నిన్నితడు విడిచిపెట్టడు.

బాల:- అంతగ నన్ను బాధించటానికి అతనిపట్ల నేనేం నేరం చేశాను?

సంగు:- అంత అందముగ పుట్టటమే ఆడదాని మహానేరము.

నాగ:- ఆ మాటలోని భావం నాకర్థం కావటంలేదు.

సంగు:- అర్థం కాకపోవటం నీ యసమర్థత. నాకంటే నీవు నాజూకైన దానవట - నీతో వాడికామం నెరవేరాలట - నామీద రోత నీమీద ప్రీతియట. అలా అన్నాడు - యిలా లేచాడు నన్ను త్రోసివేశాడు. నిన్ను తీసుకొనివచ్చాడు. వీలుచూచుకొని నిన్ను వివాహమాడుతాడంట.

నాగ:- (భయంతో) ఆ ! నీవు చెప్పిందంత నిజమేనంటావా ? నీచుడంత పనికి పూనుకొన్నాడా ?

సంగు:-అంతపనికి పూననివా డింత పనెందుకు చేస్తాడు ? మాయజంగము వేషమెందుకు? మంత్రాల ప్రయోగమెందుకు ? పిల్లలతో యెడబాటు పెనిమిటితో యెడబాటు యిందుకు కాకపోతే యెందుకు వచ్చినట్లు తల్లీ ?

నాగ:- వీడికింత శక్తి యెలా వచ్చింది ?

సంగు:- తలక్రిందుగ చేసిన తపోబలం-మహాకాళి యొసంగిన మంత్రదండ ప్రభావం.

నాగ:- అయితే మారాటిని జయించే మార్గ మేదియును లేదా ?

సంగు:-ఉన్నది. చాల భయంకరమైనది. సామాన్యులకు సాధ్యముకానిది నాకు, అతనికి తప్ప నరులకు తెలియని నిగూఢరహస్యం. చెప్పుతున్నాను. చెవులు పెట్టి విను. ఆరు సముద్రాలు-అవి దాటితే అవతల సముద్రంలో జీవగడ్డ-జీవగడ్డ చేరితే పెద్దమఱ్ఱి చెట్టు- మఱ్ఱిచెట్టు నెక్కితే మార్గమును చూపే తొఱ్ఱ-తొఱ్ఱలో దూరితే పాములు, తేళ్ళు, దయ్యాలు, భూతాలు-దయ్యాలను దాటితే పంజరం-పంజరము వెతికితే రామచిలుక-చిలుకగొంతు పట్టుకుంటే మరాటిప్రాణాలు పట్టుకున్నట్టు.

నాగ:- అబ్బా ! అసాధ్యకార్యమే. అయితే మరాఠి కోటనుండి బయట పడే మార్గము లేదా ?

( మరాటీ ప్రవేశించుచున్నాడు )

మరా:- (తనలో) ఉన్నది. సంగుకూడ సమయానికున్నది. గూటిలోని పిట్టలు రెండు గుడుగుడు మంటున్నాయి. క్రొత్త పిట్టకు, పాతపిట్టకు పొత్తు కుదిరిందా ? పోరు రేకెత్తిందా ? అదేదయిన కాని ఆలకిస్తాను. ప్రక్కన నక్కితే కథ చక్కగ రక్తి గట్టుతుంది. (దాగును)

సంగు:- ఒక్క వుపాయము చెబుతాను. ఓపికతో వింటావా ?

మరా:- (తనలో) వింటావా అంటావేం ? వింటారా అని నన్నుగూడ కలిపిమాటాడు.

నాగ:- అపాయాన్ని తప్పించే వుపాయాన్ని - ఆలకించడమే కాదు, ఆచరిస్తాను.

మరా:- (తనలో) ఆచరించేవాడ్ని అనుభవించేవాడిని నేనున్నాను.

సంగు:- ఆలోచించినంత తేలికగ అవకాశాలు దొరకవు.

నాగ :- అలాగయితే కాస్తవిషమైన కనికరించు తల్లీ !

మరా :- ( తనలో ) కడవలనిండ కల్లుసారావుండగ కాస్త విష మెందుకు ?

నాగ :- అదెందుకని ఆలోచిస్తున్నావా ? ప్రాణాన్ని ధారవోసి మానాన్ని రక్షించుకుంటాను. అవకాశం లేనివేళ స్త్రీలకాత్మ హత్యే శరణ్యం

సంగు :- ప్రాణాలు తీసుకొనటం చేతగాని పని—ధైర్యమునుపొందితే దారి దొరుకక పోదు. నీ నీతి నీవు నిలువబెట్టుకో. ఆడదానిశక్తి అపారమయింది. సౌశీల్యము చెడనంత కాలం సర్వేశ్వరునయినా సరే, యెదిరిస్తాం - బెదిరిస్తాం. అక్రమంగ సంచరించే మరాఠి శక్తి హరించిపోవక తప్పదు. సహనములో సౌఖ్యమున్నది.
మరా :- ( సంగును సమీపించి, పెద్దగ ) సంగూ !

(ఇద్దరు భయపడుతారు)

మరా :- పొంగలిగంగాళంలాగా పొంగిపోతూ యింటిలో గుట్టు యితరులకు చెబుతున్నావా ?

సంగు :- ( వెటకారంగ ) పెళ్ళాడటానికి తెచ్చుకున్న ప్రియసీమణి— కోరివలచిన కోమలాంగి — తార్చుకొనబోయే దానిని దారికి తెస్తుంటే పళ్ళు కొరుకుతు పైకి దూకుతున్నావేం ?

మరా :- (కోపంతో) నన్నే ధిక్కరించి నాటకమాడుతున్నావా ?

సంగు :- నాటకమాడటం నాచేత గాదు రాజా! మాయజంగం వేషం వేసింది నీవు — మాయకూతలు కూసింది నీవు — కూడ దెచ్చేకాంతను కుక్కను చేసింది నీవు. ఆనాడు నన్ను ప్రేమించావు - యీనాడు దీన్ని ప్రేమిస్తున్నావు - ముందొకనాడు మరొకదానిని ప్రేమిస్తావు. పరగవారి కామానికి మంచి, మరియాద లేదా ? నీతినిజాయితీలు నిర్మూలమయ్యాయా ? హద్దూపద్దూ లేకుండ తిరిగే నీపెద్దరికం పాడయిపోయే రోజులు రావా ?

మరా :- సంగూ ! తెలిసిమాటాడుతున్నావా ? తెలియక ప్రేలుతున్నావా ?

సంగు :- తెలుసు - బాగ తెలుసు. నేను తెలిసే మాటాడుతున్నానని, నా మాటలలో యదార్ధ మున్నదన్న సంగతి నీకు తెలుసు - నా కిపుడు తెలియని దొకటిమాత్రమే కామాంధకారముచే పొరలుగమ్మిన నీ కన్ను లెపుడు నిన్ను, నీయహంకారాలను, నీ యత్యాచారాలను సరిచూచుకో గలదా యను సంగతే తెలియదు. నాకే కాదు - నాలాంటి నాతి యెవ్వరయిన నమ్ముకున్న నాధుడు నిరసించినపుడు - కాని దానిని కామించినపుడు - కాపురంలో కాపురం కలిసినపుడు తెలియనే తెలియదు.

మరా :- (కోపంతో) సంగూ ! శ్రుతిమించి చూరుదాటుతున్నావు. ముందుగతి చూచుకొని ముప్పు తప్పించుకో. పెచ్చుమీరితే చచ్చిపోతావు.

సంగు :- మీరు మితిమించి దారితప్పకపోతే నేను శ్రుతిమించి చూరు దాటను. మరాఠిమహరాజా ! బాగ యోచించుకో. నీవీ బాలనాగమ్మను దక్కించుకొంటానికి బాధపడుచున్నావు - నేను నిన్ను దక్కించుకుంటానికి బాధపడుతున్నాను. అన్యకాంత మీద నీ యారాటం - అయిన మగవానిమీద నా యభిమానం. నీ కోరికకంటే నా కోరిక నిజముగ పవిత్రమైనది - ధర్మబద్ధమైనది - అధికార రూపమైనది. ఎటులందువా ? నిన్నామె భావించక పోయిననూ నీ వామెను కామించావు - నన్ను ప్రేమించినవానినే నేను వాంఛించుచున్నాను. ఏ సంబంధము లేని యొక పరాంగనను మత్సరముతో నీవు తస్కరించావు, బంధించావు - అయినపుడు ఒకనాడు, నన్ను ప్రేమించి - లాలించి - దరినుంచుకొన్న పురుషునికై నే నెందుకు నిర్బంధించ కూడదు ? కంటితో చూచినంత మాత్రాన నీ వా నాగమ్మను మరువలేక పోయావు కంఠమున తాళికట్టిన కాంతునిమీద,

కడుపునబుట్టిన బిడ్డమీద నాగమ్మ కెంతయనురాగ ముంటుందో ఆలోచిస్తున్నావా? అసలు నీ కా విమర్శ యున్నదా? అయితే నీవు మనిషివా ? రాక్షసుడవా ? నీయది జాలిగుండెలా? రాతి బండలా ?

మరా :- సంగూ ! నిన్నేంచేస్తానో తెలుసా ? నీ బ్రతుకంతా నా గుప్పిటలో నున్నదన్నమాట మరిచిపోకు.

సంగు :- ఆ విషయం నా కాదికాలంనుండి తెలిసేవున్నది. నీ జీవిత రహస్యం నాతో చెప్పిన మాట నీవే మరచిపోయివుంటావు

మరా :- (కోపంతో) నా గుట్టు తెలుసుకొని నాకే కీడు చేస్తావా ?

సంగు :- లేదు లేదు నీ కపకారంచేసి నే నేమి సుఖపడుతాను. నీవుంటేనే నా యానందం. బాలనాగమ్మను బందినుండి విడిచి పెట్టు. అక్కడవారి కాపురం — యిక్కడ మన కాపురం కుదుట బడుతాయి

మరా :- (కోపంతో) లేకపోతే ?

సంగు :- ఏమి చేస్తానో, ఎలా మారుతానో నాకే తెలియదు.

మరా :- నోరుమూయ్ !

సంగు :- అవసరం లేదు. మనుష్య నేత్రాలతో అమానుష కృత్యాలను చూచేదానికన్న, నీలాంటి నీచమదాంధునకు భయపడుతు బ్రతికేదానికన్న సాహసించి — సత్యం వచించి — రాతిగనో, రప్పగానో పడియుండటమె పరమోత్కృష్టం. కానీ చూస్తావేం? చేతిలో మంత్రదండ ముంది - చెడ్డ పౌరుషముంది. అంతేగా ?

మరా :- అంతే, నీ గతి యింతే—చెట్టుగ, పుట్టగ చేయదలచుకోలేదు, కుక్కను చేసి నిన్ను గుమ్మంలో కట్టివేస్తాను. ( మంత్ర దండ మును చూపి ) ఓం — హ్రీం — క్లీం. ( అనుచుండ సంగు కుక్కగ మారును. ) అహ్హాహ్హా ! అహ్హాహ్హా సంగు కుక్క ! నమళ్ళసంగు కుక్క ! బాలనాగమ్మా ! సంగుతో యేదో మాటాడుతున్నావుకదూ ? మాటాడు — బాగ మాటాడు,

పాపం మీ రిద్దరు స్నేహితురాండ్రుకదూ ? మీ యిద్దరిని దూరం చేయనులే. ( తెరలో కలవర మాలించి ) కాపాలీ !

కాపా :- ఏం కావాలి ?

మరా :- కోట కావలనున్న కోలాహలమేమి ?

కాపా :- పానుగంటిప్రభువులు పగసాధింప వచ్చుచున్నారు

మరా :- ( వెటకారముగ నవ్వి ) పానుగంటిప్రభువులు పగ సాధింప వచ్చుచున్నారుగా ? బాలా ! నీ భర్త వస్తున్నాడట. నన్ను చంపి నిన్నెత్తుక పోతాడుగదా ? రా ! ఇటురా ! అటుచూడు. అడుగో నీ భర్త — అదుగో నీ బావలు. మరాఠి నెదిరించిన వాడు మనలోకంన లేడని వారికి తెలియదు. చూడూ! (మంత్ర దండమును లోపలకు చూపి ) ఓం - హ్రీం — క్లీం (అని నవ్వి) అహ్హాహ్హాహ్హా ! శూరాగ్రగణ్యులు శిలావిగ్రహము లైనారే. చూచావా, బాలా ! పానుగంటిప్రభువులు- పాషాణప్రతిమలు. అహ్హాహ్హాహ్హా ! అహ్హాహ్హాహ్హా !

నాగ :- హా ! (అని మూర్ఛబడును )

మరా :- బాలనాగమ్మ భయపడింది పాపం

బాల :- ( మెల్లగ లేచి ) హా ! దైవమా !

గీ॥ ఎచటి పానుగంటిపురంబు ? యెచ్చటి దీ మ
రాటికోట ? నా కేల నిర్బంధనంబు ?
యింద్రజాలమొ ? యిద్ది మహేంద్రజాల
మో యెరుంగజాలగనైతి నో పరాత్మ !

మరా :- బాలా ! కంటినీరుబెట్టావు. మాంగల్యం పోయినదనా ? మగడు పోయినాడనా ? మరేమి విచారించకు నే నుండగ నీ కా దిగు లక్కరలేదు. మగడుపోతే యీ మాయలమరాఠి వున్నాడు. మరాఠి వుండగ మాంగల్యమున కేమి లోటు ? మరొక్క- రహస్యం. నాకు సంగుపేచీ లేదు ... నీకు కార్యవశ్ఠి

బాధాలేదు. మన మిద్దర మింక మహదానందకరముగ మసలు కొనవచ్చుచు.

నాగ :- ( రోషముతో ) ఛీ! పశువా! ఏమి యరచుచున్నావో, యెవరి ముందు సంచరించుచున్నావో, యే ఫలితము నొంద నుంటివో తెలిసియే వాగుచుంటివా ?

మరా :- పిచ్చినాగమ్మా! పెచ్చుగ మాటాడకు. నాకు పూర్తిగ తెలుసు. నీ వింక నా భార్యవు కాబోతున్నావని నిశ్చయంగ తెలుసు. నిన్ను ప్రేయసీమణిని చేసికొని, నిన్ను పంజరంలో చిలుకలాగ పలుకరించుకొని, ప్రాణాలయినా నీ పాదాలముందు సమర్పించుకొంటానికి సంసిద్ధంగ వున్నాను. నీ సౌందర్యాతి శయానికి ముగ్ధుడనై పోయాను —— ప్రేమభిక్ష ప్రసాదించమని దాసోహమంటున్నాను. కూడివచ్చిన యీ యదృష్టాన్ని కోలు పోవద్దని మంచిగ, మరియాదగ, మమకారముతో మరిమరి చెవుతున్నాను. తంటాలుపెట్టక మాట వినుకొంటావా ? పందిరి మంచంమీద, పూలపాన్పులపైన, పరిచారికలసేవలతో పకీరుని మెప్పించుతావు — పరమానంద మనుభవిస్తావు. పెంకెతనంతో పెనగులాడుతావా ? బందిఖానాలో, బండలమీద, భటుల నిర్బంధనలలో బాధపడిపోతావు.

నాగ :- ఛీ! దుర్మార్గుడా!

శా॥ లేరా, తల్లియునక్క-చెల్లియులు - నా లీలన్ దురాత్మా! ననున్
ఘోరంబైన విషాదఘట్టములతో కుందంగి నిట్టాడగా
నోరా నీయది నాల్క తాటిపలకా ? అన్యాయమంచెంచ వో
తోరీ! పాపఫలంబు తప్ప దిక నీ కొక్కింత నిక్కంబుగన్.

మరా :- ( నవ్వి ) ఆడదాని కాది కోప మధికమేతె, మొదటలో సంగు నీకంటే మిడిసిపడింది. మెల్లగ రోజుల జరిగేకొంది పిల్లి లాగ లొంగివచ్చింది. చూడు బాలా! అంతకోపంగ నున్న నీ మ్ముఖం నా కన్నుల కెంతో కోమలంగ కనుపిస్తుంది. నీ విలా నిత్యం నన్ను తిట్టుతుంటే నా కెంతో సంతోషంగ వుంటుంది.

ఆడదాని తిట్టులో అంతమాధుర్యం యెలా వచ్చిందో కదా ? ఏదీ తిట్టు – మళ్ళితిట్టు – గట్టిగ తిట్టు. ఆ చిట్లించిన మోము– ఆ ముడివడిన కనుబొమ్మలు – ఆ చెదిరిన మోముపై జారిన ముంగురులు మరొక్కసారి నాకు చూపించు.

నాగ :– ( తనలో ) ఈ దుష్టు నేమనినను లాభము లేదు. ప్రస్తుత మేదేని మాయోపాయమునగాని వీడావలకు పోడు. వీడు దూరముగ నున్నగాని వేరాలోచనకు వీలు కలుగదు.

మరా :– నీ వేదో ఆలోచిస్తున్నావు. దగ్గరకు రావటానికి సిగ్గుపడుతున్నావు. నా మాట త్రోసివెయ్య వన్న నమ్మకంతో యింత పని చేశాను. రా ! ఎన్నాళ్ళనుండో నీకొరకు తపించుచున్న యీ పకీరుని సంతోషపెట్టి . నీవుకూడ స్థాయిగ వుండు. ( సమీపించబోవును. )

బాల :– ( దూరముగ తొలగి ) పకీరుమహారాజా ! ప్రమాదము సంభవించగలదు. నా కొక వ్రతనియమమున్నది. పదునాలుగేడులు దానిని పట్టుదలతో చేయవలయును. అంతవరకు నే నెవరి నంటుకొనరాదు.

మరా :– పదునాలుగేండ్లే ? పూటకాదు – రోజుకాదు. పదునాలు గేండ్లు.

నాగ :– ఏమిచేయను మరాఠీ ! ఇంతవరకు నే నందుచేతనే సందేహించాను. మును పీ వ్రత మొకమారు భంగమైనందుననే కార్త్యవర్థిరాజున కిట్టి గతి పట్టినది. అందువలన వ్రతము మరల నాచరించవలయును. నాయందు మీకు నిజమైన ప్రేమయున్నచో లోపము రాకుండ నోమును పూర్తి చేయింపుడు.

మరా :– అలాగయితే ఆచరించు. వ్రతాచరణకు కావలసిన వసతులన్నీ కలిగిస్తాను. దేవి వరమిచ్చేలాగ దీక్ష వహించు. వెళ్లి వస్తాను (నిష్క్రమించును ).

నాగ :- అమ్మయ్యా! ఒక గండము గడిచినది. ( చేతులు జోడించి )
నాగేంద్రస్వామీ!

చ॥ రణమున నున్న మా నృపుల రక్షణకై నిను గొల్చుచున్న కా
రణమున నన్నితండు గాని రా బనియేమి పకీరు బల్మిమై
ఘనులగు పానుగంటి పురకాంతుల గెల్చు టిదేమి దేవ! ఇం
కనయిన మమ్ము నర్మిలి సుఖంబుగ నేలగదయ్య గ్రక్కునన్.

( తెర జారును )



# బాలనాగమ్మ

## (పంచమాంకము)

(కాళికాలయమున బాలవర్ధిరాజు ప్రవేశము)

బాల :- (చేతులు జోడించి)

గీ॥ అంబ ! కాళికాంబా ! జగదాంబ ! సత్కృ
పామయీ ! భక్తరక్షణీ ! భగవతీ భ
వత్ దయాకరదృష్టి గాపాడు తల్లి !
కరము లెత్తి చేసితి నమస్కార మొకటి.

మాటాడవేమమ్మా! మాయందింత కోపమేలనమ్మా ! మాయమ్మ మరాళిచరలో వున్నదట — మా నాన్నలు మంత్రింపబడిన బొమ్మలైనారట. వారందరిని రక్షించాలి — వంశమర్యాదలు నిలుపుకోవాలి. అమ్మా ! మాటాడవమ్మా ! ఆలశ్యం చేయకమ్మా ! ఆపదలో నున్నాము. అనుగ్రహించి కాపాడవమ్మా! నీ పాదాలు పట్టుకొంటున్నాను. నీకు మ్రొక్కుకొంటున్నాను. నీవే దిక్కని ప్రాధేయపడుతున్నాను. నీకు పుణ్యముంటుదమ్మా! (కోపంతో) ఇంతగ వేడుకొన్నను నీ మనసు కరగలేదా ? నీవుకూడ నామీద పంతం కట్టేవా ? అవును నాతో యెందుకు మాటడెదవు ? నా ప్రార్థన లేల నాలకించెదవు ? నా గతేల విచారించెదవు ? కోళ్లను బలియిచ్చినానని నామీద నీకు దయ కలుగుతుందా ? కుంభం వండిపోయించానని నాయందు కనికరము చూపుతావా ? ఆగ్రుడ్లు — ఆపళ్లు — అంతా చూస్తుంటే ఆ స్వరూపమే చెపుతుంది మనుష్యులను మ్రింగే మారివిగాని మన్ననలలాలకించే మాతవుగావని —

గీ॥ మంచి, మరియాదమాట లోకించు కెరుగ
నట్టి బ్రహ్మరాకాసి వీ వొట — నీదు
విభుడు — విసిగి, బైరాగియై బిచ్చమెత్తి
కాల మెట్లో గడుపుచుండె కాళికాంబ !

మగని శరీరమె సగము మెక్కిన మహామారివి నీ వెక్కడ ?
భక్తులమైన మాలాంటివారిని భక్షింపక రక్షించు టెక్కడ ?

మ॥ ఇతర ప్రాణిసమూహ కంఠములనే హింసించి నీ చెంత కా
మితసిద్ధిన్ బడయుంగజాల జననీ ! మేలైన — క్రీడైన గా
ని తగన్ పూజ్యుల సౌఖ్యసంపదల దన్పింపన్ మదిన్ గోరి స
మ్మతి నిత్తుగ వడి నా శిరంబె గొనుమమ్మా ! భద్రకాళీశ్వరీ !

(అని కంఠమును కోసికొన నుంకించును)

కాళి :- (ప్రత్యక్షమై) శాంతి వహింపుము, కుమారా ! శాంతి వహింపుము !! సాహసమునకు సంతసించితిని. నీ భక్తికి మెచ్చి నేను ప్రత్యక్షమైతిని. నీ సంకల్పము సఫలీకృత మగుగాక! నా వరప్రసాదితమైన యీ చంద్రహాసమును ధరింపుము. నిరుప మాన జయంబు నీకు స్వాధీన మగును. జడియకున్న జయము తప్పదు. ఆపదసమయములో నన్ను స్మరింపుము. ఆపయికార్య భారము నేను వహింతును. — (అదృశ్యమగును.)

బాల :- (సంతోషముతో) ధన్యుడను. తల్లీ! నిన్ను నమ్మినవారి కే కొరతలు నుండవు గదా ? ఆశ్రితజన కల్పవల్లి వని నిన్ను శ్లాఘించినవార లమాయకులు కారుగదా ? (రోషముతో) ఓరీ ! మరాటీ ! ఇంక నీ కాయువు మూడినదిరా !

ఉ॥ వీరులు పానుగంటి పృథివీపతులే సమరాన నిల్చినన్
పోరగజాలవంచు చెడుబుద్ధి కుయుక్తి ఘటించి తంతువ్యా
పారమునన్ జయించు టొకప్రజ్ఞయె? దుష్టుడ ! బాలవర్ధి సం
చార మెరింగి రమ్ము నను సంగరమం దెదిరింప జాలినన్.

(అనుచు నిష్క్రమించుచుండగ తెరవ్రాలును — వెంటనే డప్పువాడు వాయించుచు ప్రవేశించును.)

డప్పువాడు :- ఓ అమ్మల్లార ! అయ్యల్లార ! అక్కల్లార ! అన్నల్లార ! సిన్నోరికి, పెద్దోరికి — ఆడోరికి, మగోరికి అట్టాది వర్ణాలవో రందరికి యిందుమూలకంగ యెరిక సేసే దేమిటంటే — ఊరికి ఉత్తరంగ, ఊరసెరువుకాడ గట్టుసాటు నున్న గచ్చపొదల్లో పొంచి వున్న పులిగాడిని సంపేసి ఆనవాళ్ళు సూపినోరికి మన రాజ్జెం యేలే మా రాజుగారు వారమ్మాయిని యిచ్చి అరద రాజ్జెం యిచ్చి పట్టాబిసేకం సేత్తామన్నారహో —
(నిష్క్రమించును.)

( తెర లేచుచుండగ చాకలి తిప్పడు ప్రవేశము )

తిప్పడు :- నాయేలు దా పులిగాడు నా కోసమే కూకుండాడు. సెరువు కాడ కెల్లితే పులికాంత నన్ను సీలిసి సంపేత్తదాయె — ఊల్లో కెల్లితే కాపులు, కరణాలు నా యూపిరి తీసిపారేత్తారాయె ఎట్టా సచ్చేటట్టు ? సాకలోడి సావూబతుకులు తోటి కామందు లోరి కేంపని ? సాకు దొరికితే సాలు సంపుకు తింటారు. మురికి గుడ్డలు నానుతుకట మబద్ధమయితే, ముదుసూబు కరణాలు నన్ను తన్నటం నిబద్ధమవుతుంది. సావంటే నాకంతగ యిశారం లేదుకాని నాను సచ్చిపోతే నా పెల్లాం నా మీదబడి యేడుత్తుందా ? యేడవదా అని యిశారం. అదుగో, వత్తుందిలే. రాంగానే యింకెందుకూ ? అడిగిపారేత్తా.

తిప్పి :- ( ప్రవేశించి ) యేంది మామోయ్ ! ఏకంగ కడిగిపారేత్తున్నావ్ ?

తిప్ప :- కడిగేత్తానా ? కడిగేత్తానా — మడిచేత్తా ! పొడిచేత్తా.

తిప్పి :- పొడిసేత్తానని మాలావు పొగురుగ యిడిసేత్తుండావు కాని, పొడిసేత్తానంటే నీ కింద పడియుండే దోతి మామా ?

తిప్ప :- నీ మాట కాదులె పిల్లా ! నే నేదో కుశాలగ అన్నానులే. ( కొంచెమాగి ) ఇద్దో కోడలా ! ఇటు సూడు. నిన్నోమాటడుగుతాను. నిజం శెబుతావు కదూ ?

తిప్పి :- నిజం సెప్పకపోవటానికి నిన్ను సూత్తే నాకు బయమా ఏంటిి?

తిప్ప :- ( నవ్వుకుంటూ ) అంతేగా మరి? ( వెంటనే ఆలోచించుకొని ) ఆఁ ఆఁ అదేమిటి ? ఇద్గో తిప్పీ ! ఏంటంటున్నావ్? ఎంత సెడిన నాను నీ యింటాయన్ని కదా ? బకితి లేకుండ నాకేం బయమా అంటావేం ? నలుగురిలోని కొత్తే నా మొగాని కేమయిన పరువు వుంటుందా అంట ?

తిప్పి :- మాటవరసగ అడుగుతాను, మరేమి అనుకోమాక గాని మామయ్యా ! మేనమామ మొగుడు మొగుడు కాదు — మేనకోడలు పెళ్ళాం పెళ్ళాం కాదంటారుగందా? ఇంత గుంట నయిననాటనుండి యీాపుమీాద వేసుకొని మోశావుగందా ? అమ్మతో బుట్టువులో అయిన సంబందంగందా ? బరతవైతే మాతరం బయమెట్టా వత్తాది సెప్పు మామయ్యా ?

తిప్ప :- మాకడ్డ తంటా వచ్చిందె నీతోటి ? కూతలు నేరిసిన పిట్టవు కుదురుగ వుంటావేటి ? ఎంత మేనమామనయితే మాతరం సొంతం బయం లేకుండానా ? సబబుగ లేదు పిల్లా ! సగం బయమయినా వుండాల. కాదంటే నాకు కోపం వొత్తుంది. నాకు కోపం వత్తె పెద్దపెద్దలె దడుత్తుంటారు — కట్టుపంచ లేమన్న సింపేత్తానేమొ నని...

తిప్పి :- అల్లబట్టలు నువ్వుతుకుతుండావు కామట్టె సింపేత్తావేమోనని ఆల్లకు బయముండొచ్చుగాని—నాను యిడిసిన బట్టలు నువ్వుతుకుతుండావేటి ? నాకు బయముండటానికి ?

తిప్ప :- ఇద్గో కోడతా !

తిప్ప :- ఏటి మామయ్యా !

తిప్ప :- ఇద్గో శెబుతుండా ! ఇయ్యాలనుంచి నువ్వు కట్టిడిసిన పంచలు నానె వుతికేత్తా. నన్ను సూత్తే నువ్వు కాత్తైన బయం పెట్టుకోవాల .

తిప్పి :- బాగుందది కాని, బావన్లోరింటి కెల్లొత్తా ఈడనే వుంటావా ?

తిప్ప : బాపనోరింటికా ? బట్టలకేగా ? నే నెల్లొచ్చాను. నువ్వొందుకులె అదికాదు కోడలా ! ఆడకూతురివిగందా; ఇంటింటికి నువ్వు వొంటరిగ పోతానంటే—నా పానెం గతక్కుమంటుంది. ఆడంగులుంటారు — మగంగులుంటారు వసోరుంటారు — వడుసోరుంటారు పోకిరోరుంటారు — పుండాకోరోరుంటారు.

తిప్పి :- నాకు తేనిబయం నీ కెందుకు మామా ? బాపనోరింటికి పోయి బలె తొందరగవత్తాను. మంచిరోజడిగి మల్లొత్తాను మామయ్యా !

తిప్ప :- మనకెందుకె మంచిరోజు ? ఇల్లు కొంటున్నామనా ? పిల్లల్ని కంటున్నామనా ? ఒద్దులె.

తిప్పి :- ఎందుకేటి ? ఇవు డునుకొన్నాంగా ? బాపనోరింటికి పోయి " బాబయ్యా ! బాబయ్యా ! "నాను యిడిశిన బట్టలు మా మామయ్య ఉతకటానికి — నాను మా మామను సూత్తే బయంగ వుండటానికి మంచిరోజు సూడుమని మరేదగ అడిగివత్తా.

తిప్ప:- ఆపద్దతేమి బాగుండలేదు కోడలా! అయినా తెలవకడుగుతాను. పంచాంగం సూపిత్తే అప్పటినుంచి పతివెతవవుతా వన్నమాట?

తిప్పి :- ( కోపంగ ) ఏందిరోయ్, మామా ! ఇయ్యాలనుండి పతివెతనంటే యిన్నాల్లబట్టి కాదన్నమాట ? మాటలు జాగరతగ రాకపోతే మందిలో తిరగవు.

తిప్ప :- అదేటికోడలా ! అట్టాగంటివి ? నన్ను సూత్తే బయంగ వుంటానని నాముంగల్నె వొప్పుకున్నావుగంద ? ఇంతలోనె యీతిరకాసా ?

తిప్పి :- అందుకని నాను పతివెతను కాదంటావేమిటి ?

తిప్ప :- కాదులెపిల్లా ! కుశాలుగ అన్నాను. నికాలుసయిన పతివెతవు కాకపోయినా సుమారయిన పతివెత వేలె. అచలే — అచలు కలితిలేని పతివెతకి కట్టాలెక్కువగదూ ? అందుకని, ఆలోసించి

అంతపతివెతవు కాకుండ అంతగయ్యాళివి కాకుండ మద్దెరకంగ వుంటె మనకుసాల్లె. ఎట్టాగుంది మనాలోశన?

తిప్పి :- ఎట్టా గుండాదా ? నాను సచ్చినట్టుండాది.

తిప్ప :- ఇద్గో కోడలా ! గుబిక్కుమని గురుతుసేశావు నామీద నీకు పేమవుందని నమ్మకంగ సెప్పేవుగందా ! నాను సచ్చిపోతే నువ్వేడుత్తావంటే ?

తిప్పి :- ఛా ! అదేమిటిమామా ! లచ్చనంగవుండి చచ్చేమాటలా ?

తిప్ప :- అదిగాదమ్మా ! మురికిపిండటానికి నానా శెరువుకాడికెల్లాలా ? ఆ పులిగాడు నన్ను సంపేత్తదా ? మరి నానెట్టా సచ్చేది అంట ?

( బాలవర్ధి రాజు ప్రవేశము )

బాల :- ( ఎదుటచూచి ) ఇందేదిరయో శా స న ము న్న దే ? ( సమీపించి )

ఉ॥ గాసిల జేయు బెబ్బులిని గ్రక్కున జంపి, నఖంబు లానవాల్
గోసుక వచ్చినట్టి యనఘుండగు వానికి నర్ధ రాజ్య సిం
హాసన మిచ్చి పట్టణమునందు మహావిభవంబు మీరగా
నా సుతనిచ్చి బెండిలి ఘనంబుగ జేసెద నిక్కువంబుగన్.

యిట్లు —— పులిరాజు —— పులిరాజ్యం

( తిప్పని చూచి ) ఏమయ్యా ! పులిని చంపినందుకే పిల్లనూ యిచ్చి రాజ్యం యిస్తారా ? భేష్ ! ఒక్కదెబ్బకు రెండుపండ్లు.

తిప్ప :- వులంటే నీకేం పిల్లిమాదిరుండట్టుందే ?

బాల :- అంత గొప్పవులయితే ఆ పొదయెక్కడుందో చూపండి.

తిప్పి :- సంపెయ్యటానికి వచ్చిండు —— సాహసంగల కుఱ్ఱాడు.

తిప్ప :- ఆ పులి యిట్టాంటోల్ల నెంతమందిని నోటేసుకుందే తిప్పి !

తిప్పి :- కాదేటిమామా ! పుచ్చిపోయిన పోకచక్కలా వుక్కట నేసుకుంటాది.

తిప్ప:- అబ్బాయి, కత్తాయనా! పండంటిబిడ్డవు పాడయిపోతవు. అరద రాజ్జానికో? ఆడపిల్లకో బెమపడి బయలుదేరావు కామోసు. అన్నెయంగ పాడవుతావు. కొమ్ములు తిరిగినోరే సొమ్మసిల్లి పోతే సంటోడివి నువ్వు సంపగలవేటి? పో. పో. ఊపిరుంటే కాంత ఉప్పుగల్లమ్ముకోవచ్చు.

బాల:- నీ కున్న పిరికి నా కేమి లేదులె. పులితో వేట - నాకు పిల్లితో చెల్లాట.

తిప్పి :- అబ్బో, మాగొప్పగ మాటాడుతుండావే ? మాటల వసేనా ? ఈటెల వసగూడనా ?

బాల :- మాటలవసో, యీటెలవసో - పొదచూపిస్తే మీకే తెలుస్తుంది.

తిప్పి :- మామా! దొండపండులాగున్నాడు. దొరబాబుల బిడ్డడేమొ. సంతు తంతు లేనివారముగదా! సాకుకుందామా?

బాల :- సాకుకు నేమాట సావధానంగ చూడవచ్చుగాని, ముందాపొద చూపించండి - పోయివస్తా.

తిప్పి :- (ఎదుటచూచి భయంతో) అమ్మయ్యో ! పులి మనవైపే పరుగెత్తుక వస్తుంది మామోయ్ !

తిప్ప :- పదవే తిప్పీ! పరుగెట్టి పానాలు నిల్పుకొందాం.

( ఇద్దరు పరుగెత్తుదురు )

బాల :- ( కత్తిని దూసి ) ఓసీ క్రూరవ్యాఘ్రమమా!

ఉ॥ చిక్కిన ప్రాణవర్గమును చీల్చి - వధించి - భుజించి - మించి - మ
త్తెక్కి చరించు నీ బ్రతుకు నిప్పటితో సరిపోయె - యింక నీ
వెక్కడి కేగినన్ విడువ డీ ధరణీశతనూభవుండు నిన్
జక్కడగించి రాజ్యమున సౌఖ్యము గూర్చెడు కాలమబ్బెడున్.

( నిష్క్రమింప తెరజారును. )

తిప్ప :- (ప్రవేశించి) ఏలెడు కుఱ్ఱోడు లేకమోతె యేమొనను కొన్నా. సిటికలో పులిని సంపి సిపుక్కున పోయిండు. పిచ్చి పిల్లోడు కామోను, వచ్చిన దారే పోయిండు. కదలకుండ దగ్గరకు పోయి కాల్లూంతోక కోసకెల్తా, రాజుగోరింటికి పోయి రణధీరున్ని అని శబతా. పులిని నానే సంపానని బోకరించేత్తా అనుమానంగ వుంటె ఆనవాల్లు చూడమంటా, చబలోని వారంతా సూత్తే సత్తెంగ నానె పులిని సంపారంటారు. ఆమోయిన రాజుగారమ్మాయిని పెల్లాడి రాజుగారల్లుడ్ని అయితాను కామోను. రాజుగారల్లుడ నవటమేం కరమ ? అరదరాజ్జానికి రాజునే అయితానుగంద ? ఆమోయిన రాజునై సినదొరసానిగారితో - సీ! సీ! సినబార్యతో కుశాలగావుంటా. అప్పొడీ మట్టి సాకలబాన పగలగొట్టి బంగారపు బాన సేయిత్తా. మా తిప్పి కిపుడు నన్ను సూత్తేను బొత్తిగ బయంలేదు. ఇక సూస్కో నా దరిజా ! సాకలి తిప్పడంటే రాజుగారి యల్లుడని మా పల్లెలోవాల్లంతా నాకు దండాలెడతారు కామోను. తొందరగా యెల్తా.

(నిష్క్రమించును.)

# రెండవ రంగము

( పులిరాజు మందిరము - పులిరాజు ప్రవేశము )

పులి :- ఆహా ! ఏమీ నా దురదృష్టము ?

మ॥ అనుగుం బిడ్డ నొసంగి; రాజ్యవిభవంబం దర్ధ మిచ్చెద దలం
చినగానీ యొకడేని నేటికి పులిన్ చెండాడి వేగంబ నా
తనయన్ బెండిలియాడ రా డకట మోదంబొప్ప నా రాజ్యపా
లనయుక్ బూనగలట్టి ధీవరుడు నా లక్ష్యంబు సిద్ధింపగన్.

కట్టా ! ఆదినుండియు పరస్పర సహాకారంబుల జెలంగుచు కడుంగడు నెయ్యంబున సంచరించుచున్న నా పానుగంటి రాజుల కెట్టి యిక్కట్టులు సమకూడినవి ? ఆ పానుగంటి రాకులంబున బుట్టిన యెట్టి చిట్టిపట్టయి నను యిప్పట్టున వెనుకాడునే ? వారును, నేను సంతోషముగ నున్నప్పు డొకనాడు యోగక్షేమంబుల పరామర్శించుకొనుచు "బావా ! ఏనాటికయినను మనము వియ్యంకులము కావలయునని ముచ్చటించుకొన్న వర్ధివంశపు రాజులందరు నంతరించినటు లేకదా ? పోనీ బాలుడైన బాలవర్ధిరాజు కలడని, నాకు కొడుకైన అల్లుడయిన నతడేనని, మా యుభయ రాజ్యంబుల కాతడే అధిపతి కాగలడని నమ్ముకొన్నాను. మొనమొన్న నాతండును జననీ జనకుల వృత్తాంత మెఱింగి తల్లిని చెఱవిడిపింప నేతెంచెనట. ఇంద్రమహేంద్రజాలము తెలిసింగిన యా పకీరు నీ పసివాడు జయింపగలడా ?

చ॥ అగయుగ మంత్రతంత్రముల కాది నెరుంగు పకీరడేడ ? సం
గర మన నెట్టిదో తెలియకన్ బరువెత్తెడు బాలుడేడ ? వే
చొరవడి వైరికోట నిక జొచ్చుటదేడ ? జయించుటేడ ? తా
దిరిగి సుఖంబుమీర చనుదెంచుటదేడ నసంభవంబగున్

(తెరలో) మహారాజా ! చాకలితిప్పడు దేవరవారి దర్శనార్థమై వేచియున్నాడు.

పులి :- లోనికి రమ్మనుము.

(తెరలో) చిత్తము.

పులి :- పాపము వీడి పరిస్థితి మరింత విచారకరము.

తిప్ప (ప్రవేశించి) దండాలుబాబూ! దండాలు.

## కీర్తన :

అందుకని సత్తె సచ్చానులెమ్మని మూర్గంసేసుకొని గచ్చు పొదలకాడ కెల్లి కదలకుండ కానుకొని కూకుండా నాయేలు దాపులి నా యేపుకే వొత్తూంది. నీకేంసెప్పేది నా రాజా! నిలవబడినూశా. ఆమోయిన పానాలమీద ఆశవొదులుకొని పులిమీద కలియపడ్డా. ఎట్టాగయితేయేం ? సంపేశానులే. (నవ్వి) ఇన్నాలమట్టినానేమొ ననుకుండానుకాని యియ్యాలతో తేలిపోయింది దాని బండారం. సాకలి తిప్పడంటే సామేన్న డనుకున్నావేటి ?

## పాట :

పులి :- తిప్పా! ఇటువచ్చి తిన్నగ చూడు! కాళ్ళుగాని యివి గోళ్లు కావే ?

తిప్ప :- అబద్దాలకు తిరిగి అన్నేయం సేద్దామనుకొన్నారా ? కాల్లు లేకుండ గోళ్ళెట్టాగుంటాయి సెప్పండి. పిల్లనియ్యాలిచొత్తుం దని పేసీ యెవారంలో దిగితే పకటన యేడకిపోతాది — పకటన ?

పులి :- కొనగోళ్లు లేని కాళ్లు — కుచ్చు లేని తోక తెచ్చిందిగాక భయపడకుండ బదులు చెప్తున్నావురా ?

తిప్ప :- అయితే నా మాట అబద్ధమంటారా ? నువ్వాపులిని సంపనే లేదుగంద ? పులిగోలెట్టాగుండేది నీకెలా తెలిసిందో నాకు సెప్పండి సూద్దాం, ఇద్గో మామయ్యా! ( మాట మార్చు కొని) మారాజా! ఇహా శబుతుండాం. మనం పులిని సూశాం— మనం పులిని సంపాం — మనం ఆనవాళ్ళు తెచ్చాం —

మనం శెబుతుండాం. మనం సెప్పేదానికి మారుపులేదు. కాక
పోయినా నాను కాబోరయే — అల్లుడ్నిగందా ? మరేదా,
మంచీ లేకుండ "తిప్పా! తిప్పా!" అని తిరచకారం సేత్తారేం!

పులి :- (కోపముతో) మూర్ఖా ! అడిగినదానికి బదులుచెప్పక అధిక ప్రసంగము చేయుచుంటివా ? మహామంత్రుల సమక్షమున నీకు మరణదండన విధించవలయునా ? నేరము వొప్పుకొని నిజము వక్కాణింతువా ?

తిప్ప :- (భయపడుతు) " నిజం సెప్పు - నిజం సెప్పుమని " సిగ్గ తీత్తుండారుకాని నిజానికి పులిసావకపోతే నేనా గుర్తు లెట్టా తెత్తాను సెప్పండి.

పులి :- మొండికాళ్ళు తెచ్చావుకాని - మొనగోళ్ళు మొదటి తోకే దిరా మరి ?

తిప్ప :- (ధైర్యం తెచ్చుకొని) అదా ? అది — పతిరోజూ సిక్కిన మనుచుల్ని, జంతువుల్ని సీలిసి, సెండాడి, సంపేత్తుండాది గదూ ! అందుకని అరిగిపోయాయి. అంతేగా ? లేకపోతే అచ లాటిపులికే అదేమొ — ఆలోసించండి. బాగ ఆలోసించండి. అందాక యీడనే కూకుంటాలే. ( ఒక ప్రక్క కుర్చీపైన కూర్చుండును ).

పులి :- ( తనలో ) ఔరా ! కాలమహిమ !

మ॥ అకటా ! ఎప్పటికప్పు డిట్టి వికటంబైనట్టి ఘట్టంబెదో
యొక చందంబున గానవచ్చె పులిచావూహించి మోదింతునా ?
యిక యీ తిప్పడికే మదీయ సుతనే నీయన్ విచారింతునా ?
ప్రకటంబైన మదీయ శాసనమునే వర్జించి వర్తింతునా ?
ఇంతకు నా తలవ్రాతగాని — లేకున్న

ఉ॥ ఆమెయి ధైర్యమూని, పులి నంతమొనర్చిన రాసుతుండు రా
ఢేమొ ? యెరుంగడేమొ సగమీ ధర నిత్తుమటన్న మాట ? లే

దేమొ మదీయపుత్రిని గ్రహించెడు కోరిక వానికిన్ ? వినం
జేమొ తదీయ శాసనము ? నేమిచేయు దోచకపోయె నక్కటా !

అది సరికాని ముం దీ మూర్ఖున కేమి చెప్పవలయును ? కానిమ్ము. యిప్పటి కిట్లు చెప్పి పంపెదను. (ప్రకాశముగ) తిప్పా! రేపు కొలువుకూటంబున విచారించి నీ కీయందగిన బహుమాన మిప్పింతును. నీ వింక యింటికి పోయిరమ్ము.

( తెరజారును )

# మూడవ రంగము

( రాజాంతఃపురమున - జయలక్ష్మి, మాలతి ప్రవేశము. )

మాల :- (తొందరగ) అమ్మా! అమ్మా!!

జయ :- ఏమే, మాలతీ!

మాల :- అయ్యో నాగతి - అదికాదమ్మా! ఇంకా యిక్కడనే వున్నావేమమ్మా!

జయ :- ఏమిటే నీ గొడవ? ఎప్పుడు చూచిన వేళాకోళాలు - వెక్కిరింతలే కాని ...

మాల :- కానిలేదు-చుక్కానిలేదు కాలయాపనచేయక కదలిరావమ్మా!

జయ :- అబ్బ యేమిటే - అంత తొందరిస్తున్నావు. ఈ కాస్తలోనే యేం మిగిలిపోయిందని వూపిరయిన పీల్చనీయకుండ వుక్కిరి బిక్కిరి పెడతావు? పెళ్ళివారు వచ్చి పీటలమీద దిగారా? పేరంటము మించిపోతున్నదా?

మాల :- పెళ్ళివారు వచ్చి పీటలమీద దిగారు - పెళ్ళికూతురుగారిని పిలవటానికి వచ్చాను. పులిని చంపిన వీరుడు వచ్చి పెళ్ళి కుమార్తెను చూడాలంటున్నాడు - పిల్లను చూపకపోతే వల్లకాదంటున్నాడు - అర్ధరాజ్యం పంచమని అధికారం చలాయిస్తున్నాడు.

జయ :- మాలతీ! సరసమునకు సమయములేదా?

మాల :- అవును. ఇది సమయం కాబట్టే సరసాలాడుతున్నాను.

జయ :- చాల్లే, దూరంగ పో.

మాల :- దూరంగపోతే - పని తీరిపోయిందా? నిన్ను పెళ్ళికూతురుని చేయాలి - నీ పెళ్ళికి పాటలు పాడాలి... ఇంకా!

జయ :- చెలీ! ఆ దుష్టశార్దూలము చచ్చువరకు మన కా భాగ్యమెక్కడిదే?

మాల :- పులి చచ్చిపోయిందమ్మా ! పులి చచ్చిపోయింది.

జయ :- ( సంతోషముతో ) పులి చచ్చిపోయిందా ?

మాల :- పులి చచ్చిపోయింది. పులి చచ్చిపోయిందని నీకు చెప్పి చెప్పి నేను చచ్చిపోయాను.

జయ :- మాలతీ !

ఉ॥ కొండొక కారణాన జనకుండు పులిన్ వధియింపబోక యే
దండిమగండునైన భుజదర్పము జూపినవానికి ధరా
మండల మే నొసంగుచు కుమారి నొసంగెద నంచు బల్కె నో
యండజయాన ! నాకు విభు డాతడు కాడె తలంచి చూడగన్ ?

మాల :- అందుకేనమ్మా ! ఆ సుందరాంగుని నొక్కమారు అరకంట నైన చూడమని తొందరపెట్టి పిలిచాను — తిట్లు మొట్లు తిన్నాను.

జయ :- పోనీలేవే ?. నా పెళ్ళిలో నీకాపాటి బహుమానం....

మాల :- అంతేలే. పెళ్ళిళ్లలో పెద్దలకు మిగిలేవి తిట్లే కాని -తిష్ట కాదు

జయ :- మాలతీ ! ఆ పులిని చంపిన సుందరు డెక్కడ నున్నాడె ?— ఎలాగున్నాడె ?

ఉ॥ చక్కనివాడ టే ? - పసిడిచాయల మేను వెలుంగువాడటే ?
మిక్కిలి ధైర్యశౌర్యముల మించినవాడటె ? — నాధుడంచు నా
ప్రక్కన నిల్చియున్న సరివచ్చెడు ప్రాయపువాడటే ? చెలీ !
మక్కువ గల్గెనా నృపకుమారు డెవండొ వినంగ దెల్పుమా !

మాల :- సఖి ! వైవాహికమాడుదానవు నీవును, వర్ణించుదానను నేనా ? రాకుమారీ ! దాసీదాన నగు నాకా తారతమ్యమెట్లు తెలియును ? అదియునుగాక, వచ్చినవారిని వర్ణించుటకు నేనేమి కవయిత్రినా ? చిత్రిపఠమేనియు లిఖంచుటకు నేను చిత్రలేఖనినా ? అంత అవసరమేమిటమ్మా ! అత డిక్కడ నె వున్నాడు — కనులార వీక్షించవచ్చును, మనసార ప్రేమించ

వచ్చును. అయినా, అందికబోవున్న ఆలుమగల మధ్య అన్యుల సహాయ మెందుకు ?

జయ : ఏమీా ? నే నడిగినపుడు నీవు చెప్పరాదా ?

మాల :- చెప్పగూడదని కాదమ్మా ! చెప్పలేకపోతున్నాను. ఆతని అందం చెప్పవలయునంటె నా తరం కాదమ్మా !

జయ :- అంతందగాడటే మాలతీ ! అయిన నాత డెటు లుండియుం డునో నేను చెప్పనా ? నేర్పరి వగు నీవే వర్ణింప లేకుంటివా ? అటులయిన నాతండు మన్మధాకారుడే కావలయును. అటు వంటివారిని గురించి పెద్ద లెట్లు చెప్పియుండిరో వింటివా ?

సీ॥ ఉంగరములబోలు ముంగురుల్ గలవాడు;
లక్షణమైన ఫాలంబువాడు ;
తమ్మిరేకుల బోల్పదగు నేత్రములవాడు
కన దీర్ఘమౌ నాసికంబువాడు;
జిలుగు ముత్యంపుసరుల పల్వరుసవాడు
మొలకమీాసంపు నెమోమువాడు ;
బలపరాక్రమ మొప్పు వక్షస్థలమువాడు
మేలిమిబంగారు మేనివాడు ;

గీ॥ రాణ కెక్కిన చక్కని రాసుతుండు ;
బెబ్బులిని గూల్చి — నన్నింక బెండ్లియాడి
అర్థరాజ్య మేలుకొనంగ నరుగుదెంచె
నని దలంతు నిక్కంబు నా యాత్మలోన.

మాల :- రాజపుత్రీ ! నీవు యూహించిన పోలికలున్న రాచపట్టి మాత్ర మటువంటివాడు కావచ్చునుగాని - యీా వచ్చినవాని యందట్టి సలక్షణములే యున్నవో లేక విలక్షణములే యున్నవో చూడవలదా ? ఇంతకు నతండు రాకుమారుడో - రజక కుమారుడో.

జయ :- ( కోపముతో ) ఛీ ! పశువా ! ఏమనుచున్నావు ? సుక్షాత్ర వంశ పారావార సుధాకరమూర్తి యగు నొక యువక రాకుమారుని రజక కుమారుడనుటకు నీ కనులు తలకెక్కినవా ? కటికిచీకటులు గ్రమ్మినవా? మాలతీ! మనముమనము చనవుగల వారము. చలోక్తులాడుకొనువారము వన్నేమనినను నే నోర్చు కొందును కాని, నా నాధుననిన నేను సహింపను జాగ్రత.

మాల :- ఉన్నమాటేదో అన్నానుకాని, నీకు కోపం రప్పించేమాటలు నే నెందుకంటానమ్మా ! నీ వనినట్లు నా కన్నులు తలమీాది కెక్కినట్లయితే భూతలమందున్న నీ కాంతుడు నాకు కనుపిం చెడివాడు కాడు — అతనిని గురించి నేను దెల్పియుండెడి దానను కాను — మీా చేత యీా చివాట్లు తినియుండెడి దానను కాను.

జయ :- ఇంతకు దేమిటే ?

మాల :- పులిని చంపానని వచ్చినవాడు మన పట్టణంలోని చాకలి వాడమ్మా ! వాడి పేరు తిప్పడు.

జయ :- (విచారముతో) ఆఁ ? చాకలితిప్పడా ? మాలతీ ! నీ హాస్య మునకు హద్దూ పద్దూ లేదటే ? చాకలితిప్ప డేమి ? పులిని చంపుటేమి ? వాడంతటి సమర్థుడైనచో యింతకాలము నుండియు దాని నేల సంహరింపకపోవలయును ? చెలీ ! మహా రాజకుమారికి కాబోవు మనోహరుని చాకలితిప్పనితో సరి బోల్చుట దోషము కాదా ? ఆ మాటలు రాజకుమారులు విన్నచో అలుకబూనరా ? పరిచయము లేనివారితో పరిహా సము లాడవచ్చునా ?

మాల :- నేను పరిహాసము లాడుచున్నది నీతోగాని నీ భర్తగారితో కాదమ్మా ! అయినను యిందు పరిహాస మేమున్నది ? మరి కొంతసేపటికి మహారాజుగారే కబురు చేయగలరు. ఇపుడు కాకున్న నపుడైన తెలియదా, మాలతి చెప్పిన మాట లన్నియు పరిహాసములో, పరమసత్యములో !

జయ :- మాలతీ ! మభ్యపెట్టి మధన పెట్టకే

మాల :- మభ్యపరచటాని కిందు మరు గేమున్నదమ్మా ! మన యూరి చాకలితిప్పడు మహావీరుడనంటు వచ్చాడు — పులిని చంపి వేసింది తానే నని పొంగిపోతున్నాడు — ఆనవాళ్ళు తెచ్చా నని అందరిలో చూపెట్టాడు — పిల్ల నిచ్చి పెళ్లిచేయమని పేచీపెట్టుకొన్నాడు.

జయ :- నిజముగ వీ డాపులిని వధించినాడటె — ?

మాల :- తప్పు తప్పు. నీకు కాబోయే భర్తగారిని "వీడు - వాడన వచ్చునా ? పైగా నేటినుండి మీ నాయనగారి రాజ్యములో అర్ధభాగాని కధిపతికూడ! నన్నేమయిన అను — నే నూరకుం దును కాని మా చిన్నరాజుగారినంటే నేను సహింపను. జాగ్రత.

జయ :- హా! దైవమా ! నన్నిట్టి దుర్గతిపాలు సేయనుంటివి ? కట్టడి దైవమా! పులి వచ్చి నన్ను పాలికేకలు వేయు తిప్పని కీ ధీరత్వమెక్కడిది ? మా తండ్రి మున్నొకట గోశాపంబున నాయుధంబును ధరింపనివాడై పుండరీకమును పరిమార్చక పోవచ్చునుగాక - మిగిలిన రాజన్య చూడామణులం దెవరు నా శార్దూలమును సంహరింప లేక బోయిరా ? ఇందరు వేట గాండ్రు - సైనికులు - రధికులు - ప్రతిరధికులు వధింపలేని వ్యాఘ్రంబును ఆ తిప్పడే చంపగల్గెనా ?

మాల :- రాజకుమారీ ! విచారింపకుము.

జయ :- విచారముగాక నా కింక వినోద మెక్కడిదే మాలతీ !

మాల :- దైవయోగ మిటులుండ మనమేమి చేయగలమమ్మా !

జయ :- చేయగలుగునది లేక నే చింతించుచున్నాము.

మాల :- మహారాజుగారి మనోభిప్రాయ మేమిటో ?

జయ :- ఆఁ అన్నట్టు అడగదగిన మాట నడుగ మరచాను. అందు లకు మా నాయనగా రేమన్నారే ?

మాల :- అవకాశము లేనపుడు అనుటకేమున్నదమ్మా! ఆనవాళ్ళను పరిశీలించి అనుమానమును వెలిబుచ్చారు.

జయ :- అనగ?

మాల :- ఆనవాళ్ళు అసలైనవి కావట —

జయ :- అటులయిన పులిచావ లేదన్నమాట?

మాల :- కాదు - కాదు. అతను తెచ్చిన పులికాళ్ళకు గోళ్ళులేవట - తోకకు కుచ్చు లేదట.

జయ :- అటులయిన నిశ్చయముగ దానిని వధించినవాడు వీడు కాడు. అతండెవ్వడో రాకుమారుడే అయియుండును.

మాల :- చంపినది రాజకుమారుడే యగుగాక - చంపితినని వచ్చినది రజకకుమారుడే గదా, మన మేమి చేయవలయును?

జయ :- మా నాన్నగారు నన్నిచ్చెదనని బల్కినది, పులినిచంపిన వారికేగాని, చంపితినని వచ్చినవారికి కాదుగదా? మన కేమి భయము?

మాల :- ఆ ధీరుని నిర్ణయించకముందే యీ తప్పని కాదనుటెట్లు?

జయ :- దానికేమి మాలతీ! అది మహారాజసభగాని - మామూలు మందిరము కాదుగదా? అందున్న దధికారనీయులుగాని— అజ్ఞానలోలురు కాదుగదా? చిహ్నముల పరిశీలించుట కందు సిద్ధప్రజ్ఞాశాలురు లేకపోయిరా? యదార్థము తేలువర కా తప్పని తటస్థముగ నుంచునటులు దెల్పుటకు మహామంత్రు లందు లేకపోయిరా? రాజాజ్ఞను పాలించుట కందు రాజభటులు లేకుండిరా?

మాల :- లేకేమి న్యాయమును పాలించుటకు పరంధాముడు మాత్రము లేడా?

( తెరలో ) ఒరీ! ఎవడురా! అక్కడ?

మాల :- మహారాజా! దాసి - మాలతి.

(తెరలో) అమ్మాయికి నారాక తెలియచేయుము.

మాల :— చిత్తము. దయచేయుడు.

జయ :— నాన్నగారే వచ్చుచున్నారా ? (ఎదురేగి) తండ్రీ! వందనము.

పులి :— (ప్రవేశించి) శీఘ్రమే కళ్యాణ ప్రాప్తిరస్తు.

జయ :— తండ్రీ ! మీ రేకారణముననో చింతించుచున్నారే ?

పులి :— కారణమా ? మన రాజ్యంబున గల పులి మరణించినది. వ్యాఘ్రి సంహారవార్త యొక విధంబున నానందదాయకంబె కాని మరియొక విధంబున దురంత విషాద హేతువయ్యె. అమ్మా జయలక్ష్మీ ! ఎవరో యొక రాకుమారు డద్దానిని కడ తేర్చుననియు, అతనికి నిన్నిచ్చి వివాహంబు సేయుటయేగాక, పుత్రహీనుండ నగుట నా రాజ్యంబును వాని కొసంగుట యుత్తమ మని భావించితిని కాని, పేరుప్రతిష్ఠలు లేని యీ చాకలితిప్పడు వచ్చుననియు — వానికి నిన్ను భార్యగ చేయ వలసివచ్చుననియు నేనాడయిన తలంచియుంటినా ?

జయ :— అటులయిన మాలతి చెప్పిన మాట లన్నియు యదార్థము లేనా నాన్నా ?

పులి :— ఏమీ ? నాకంటె ముందుగ నీకీ వార్త మాలతి చెప్పినదా ?

జయ :— అవును. దాని మాటలు నమ్మలేకపోయాను. ఇపు డేమి కర్తవ్యము ?

పులి :— పులిని చంపినది సత్యముగ నీ తిప్పఢా ? మరొకరా యని నిర్ణయించుటకు నాస్థానోద్యోగుల కాజ్ఞాపించితిని. ఆ తరువాత గాని మన మేచందమునను వర్తించుటకు వీలు కాదు.

మాల :— ఒకవేళ పులిని చంపిన దా తిప్పడే నని సిద్ధాంతీకరణమయి నచో మన మేమి చేయవలయును మహారాజా !

పులి :— దైవానుగ్రహ మట్లు దూరంబయ్యెనేని, శాసనబద్ధుండనై — రాజనీతివిశారదుండనై — పూజ్యుల యాజ్ఞానువర్తినై —

సత్యవాక్పాలనకు క్షాత్రవంశ కీర్తిప్రతిష్ఠలు నిల్పుకొనుటకు మన జయలక్ష్మి నా తిప్పని కొసంగి యుద్వాహము సేయుటయే కర్తవ్యమగును.

జయ :- ఏమనుచున్నారు నాన్నా! చూస్తు చూస్తూ నన్నొక శుద్ధ మూర్ఖున కంటగట్టెదరా? పదునాలుగేడులు పెంచిన మీ ముద్దుబిడ్డను మీ చేతులతోడనే పాడునూతిలో పారవైచెదరా? పాలు పోసి పెంచిన మీరే విషము పోసి చంపెదరా? చాకలితిప్పనితో నాకు కాపురము శ్మశానముగాని— సంసారము కాదు. నా మెడలో పడబోవునది పెనుబాము గాని - పసుపుత్రాడు గాదు. నాన్నగారూ! పెళ్ళికూతురనై యూరేగుటకంటే, నేను ప్రేతమునై యూరేగుట మేలు.

పులి :- అమ్మా! నా కన్నియు తెలియును. నాకు మాత్రము నిన్నాతని కిచ్చి వివాహము సేయవలయునని కోరిక గలదా? ఈనాడిట్టి ఘట్టంబున నిట్లాడవలసెగాని యింతకు ముందెప్పుడైన నీ మాటలాడితిమా?

ఉ॥ ఆడినమాట నిల్పుకొను టందరికిన్ కడుముఖ్యమాట మా
రాడగలేని, దుర్బలుడనై యొక చాకలివాని, నీవు పె
ళ్ళాడు మటంటిగాని హృదయంబున వేరొక దుష్టబుద్ధి నే
నాడినమాట గాదు! తనయా! నెపమెన్నకు మింక మీదటన్.

జయ :- ఎటులయిననేమి తండ్రీ! మన క్షత్రియవంశమహామారి నా జీవితము నిట్లు బలిగా గైకొనినగాని ప్రశాంతి నొందదేమొ? అయినను ఆ తిప్పని కిట్టి దుర్బుద్ధి యేల పుట్టవలయును? ధనమాసించిన యేని యిప్పటికయిన యదార్థమును దెలిపి, దానికిందగు బహూకరముగ నే రత్నహారమునో గొనిపోరాదా? ఏ కాంచనాంబరములో వాంఛింపరాదా?

పులి:- అటులయినచో నింక కావలసినదేమున్నది తల్లీ! మఱు లడిగిన నివ్వకుందునా? మాన్యము లర్థించిన కాదందునా? ఆ తరువాత నన్ని కార్యంబు లనుకూలములుగ గావింపను?

తల్లీ! నీకంటె, నీ యానందము కంటే నాకీ రాజ్యము లెక్కువయినవా? భోగములు ప్రధానములా? రాజధర్మ విరుద్ధముగ నడువలేక నిన్నీ ఘోరనరకంబు పాల్సేయ సాహసించితినిగాని, లేకున్న నీ మీద యీర్ష్యాసూయల చేతనా? నాకు నీయందలి వాత్సల్య మెట్టిదియో నీవు, నీ పరిచారికలు యీ రాజ్యప్రజ లెరుంగనిది కాదుగదా?

జయ :- నాకుమాత్ర మెందులకు తెలియదు నాన్నా! అమ్మను నేను చూచియే యెరుగను. ఆనాటినుండి తల్లిలేనికొరత తెలియ కుండ నన్నరచేతులలో పెట్టి పెంచారు. తలమీద నున్నదానిని నేలమీద విసిరికొట్టినట్లు నన్ను నాశనం చేయబోతున్నావు. మా అమ్మే యీ రోజున బ్రతికివుంటే —— నా గొంతు ఇలా కొయ్యనిస్తుందా? నాకీ యన్యాయం జరుగనిస్తుందా? నా కర్మ యిలా కాలిపోతుందా నాన్నా?

పులి :- (జయలక్ష్మిని దగ్గరకు తీసికొని) మీయమ్మ జీవించియున్నచో మనకీబాధలే లేకపొయ్యెడివేమొ. నీవీ దాదుల చేతిపోష ణయం దేల నాధారపడవలసివచ్చును? ఆ కన్నతల్లే తన చల్లని చేతులతో నిన్ను కళకళ నలంకరించుకొనక పొయ్యెడిదా? అప్పటికి తల్లి లేదన్నమాటయేదప్ప నీకు నేనేమి కొరత కలిగించినానమ్మా!

సీ॥ వసిడి పళ్లెరమందు పాలు జక్కెర లుంచి
కేల్పట్టి నేనె త్రాగించినాను;
పన్నీట జలకేళి పలుమారు గావించి
దుస్తులమర నేనె తొడిగినాను;
రంగుపొంగారెడు రాజశయ్యలపైన
కూరిమి నేనె జోకొట్టినాను;
మోముపై దిగజారు ముంగురుల్ కొనగోళ్ళ
నొద్దికతో నేనె దిద్దినాను;

గీ॥ అట్టి చేతులతోడ నా చిట్టితల్లి
నెట్టు లాతని చేతుల బెట్టుటనుచు
కుందుచున్నాడ నీనాడు డెందమందు
పుత్రికాఘాతకుండనై పుడమిలోన.

జయ :- అయిన నాకీ దురవస్థ తప్పనిదేగదనాన్నా !

పులి :- ఆమాట చెప్పవలయునన్న నోరువచ్చుటలేదమ్మా !

జయ :- చెప్పుటకు నోరురాకున్న పనిచేయుటకు చేతులు వచ్చునా నాన్నా ! ఒక లగ్నకాలములో కన్యాదానము చేసి వైదొలగు మీరే యింత చింతించుచున్నపుడు జీవితాంతము ననుభవించ వలసిన నేనెంతగ కుందవలయునో, యెంతకాలమునకు నావంత అంతమందునో మీరు గమనించగలిగారా !

పులి:- గమనించి నేను చేయుగల ఘనకార్య మేమున్నదమ్మా ! సత్య వాక్పరిపాలనకు బద్ధపడినాను — స్వశక్తికి దూరమైనాను. పూర్వంబునుండియు మన క్షత్రియవంశరాజు లిట్టి యిక్కట్టు లొందినవారే. ఈ సూనృతాభిమానమునకే హరిశ్చంద్రుడు కాటిసీమ నేలినాడు — ఈ సత్యశీలమునకే దశరధ రాజేంద్రుడు శ్రీరామచంద్రుని దండకారణ్యముల కనిపినాడు. ఈ గౌరవప్రతిష్టలకే కర్ణుండు రణభూమిని ప్రాణత్యాగము గావించినాడు — ఈ పరువు మర్యాదలకే భీష్ముడంపశయ్యపై శయనించినాడు. జయలక్ష్మి ! ఆడినమాటకై మేనికండలు కోసి యిచ్చినవాడు మన క్షత్రియుడే — కన్నకుమారుని చంపి భోజనంబిడిన ధీరుడు మన రాజవంశమువాడే — ముదుసలి మునీంద్రునకు ముద్దులకుమారి నిచ్చినవాడు మనకులస్థుడే — ఆ ధర్మమనుసరించి రాజపౌరోహితాది పండితు లాజ్ఞాపింతురేని నీ పాణిగ్రహణ మా తిప్పనితో జరుగక తప్పదు-ముమ్మాటికి తప్పదు. తప్పదు. ఈ పులిరాజు యే జన్మలో చేసిన పాపఫలము చేతనో యిప్పుడీదశ ననుభవించుచున్నాడు-ఇపు డీ రూపంబున ఆడపిల్లను ఆరాటపెట్టినందుకు — కన్నబిడ కన్నీటిధార

నాసట్టింట పారినందుకు ముందొక జన్మంబున వూ_ర్తిగ నను భవింపక తప్పదు — తప్పదు.

జయ:- (వారించి) నాన్నా! నాన్నా!! శాంతించండి. మరేమియు విచారించకండి. అవసరమయినచో... అవసరమయినచో....

పులి:- ఆc! అవసరమయితే....ఆతరువాత చెప్పు తల్లీ!

జయ:- అతనితో వివాహాని కన్ని ప్రయత్నముల చేయించండి.

పులి:- చేయిస్తాను తల్లీ! చేయిస్తాను. మహారాజకుమారునకిచ్చి మహా దానందముగ నీ వివాహంబు జేయలేకపోయినవు డీ పాటి పెండిలిన్నైయెనను చేయకుందునా?

జయ:- నా నొసటివ్రాలునకు మీ రేమి చేయగలరు నాన్నా!

ఉ॥ సందియమంద నేల? విధి చాలని కాలమునందు నెంతగా
కుందిన లాభ మేమి? మనకుం ఘటియించిన కర్మ మేదియేc
బొందక తప్పనే? తొలుత నోచిన నోము ఫలంబుగాక-యే
చందమునన్ లభించు ఘనసంపద లర్థాతలేనివారికిc?

మాల:- అమ్మా!

జయ:- మాలతీ! ఇపు డేమియు నాటంకము చెప్పకే.

పులి:- అమ్మా! మరియొక మాట చెప్పుచున్నాను వినుము.

ఉ॥ ఆపద నున్న వేళ పరమాత్ముడె రక్షకు డన్నమాటకుం
లోపము రాదు; నీదు మదిలోపల నమ్మి భజింపుమమ్మ దీ
తాపరరాలికిన్ జయము గల్గెడు రోజులు వచ్చునమ్మ? నే
డాపులినిన్ వధించిన నృపాత్మజుడే యిటు లేగుదెంచినన్.

ప్రభువులవారి న్యాయస్థానమున సత్యము దాగబోవదు. నీ యదృష్టమే మంచిదయిన తిప్పడు తప్పక శిక్షార్హుడు కాక బోవడు. అట్టియెడ బెబ్బులినిం దెగటార్చిన వాని నెరుంగుటకై చేయదగిన కార్యంబు లన్నియు చేయించుచున్నాను.

గీ॥ పులిని చంపిన ఘనరాజపుత్రు డెవడో
వెదకి దెల్పిన వానికి బ్రీతిసిత్తు

మించు బహుమాన మంచు చాటించినాడ
వాడవాడలలోన నే వరుసతోడ.

జయ:- యదార్థమా నాన్నా ?

పులి:- అబద్ధములాడుదునా తల్లీ ! సాధ్యమైనంతదనుక సత్యమును పరిశోధింపకుందుమా ? తస్కరులను దండింపక సైరింతుమా ? ఇంతకాలమునుండి పూలలో పెట్టి పెంచిన నిన్నిపుడు రాలపై విసరిగొట్టుదునా ? నా బంగారుతల్లిని నా చేతులతో నన్యాయం చేసుకుంటానా ? నా రాజ్యములో — నా కుటుంబములో — నా పాలనలో ఒకతల్లి లేని బిడ్డకు మోసము జరుగు తుంటె చూచుచు మిన్నకుండెదనా ? అక్రమమార్గముల నరి కట్టకున్న నింక నీ ప్రభుత్వమేల ? కాని; ఒకవేళ తిప్పడే పుండ రీకమునుచంపిన మాట నిక్కమంబగునేని రాజధర్మాను సరణముగ నీకు నేను చేయగల యుపకారమేమియు నుండ బోవదు. (కొంచెమాగి) ఆ మాట దలంచినచో నాహృదయ మల్లాడిపోవుచున్నదమ్మా !

ఉ॥ తీరిన దొక్క చింత; చనుదెంచిన దింకొకవంత యింతమే
మారయ నీదు భాగ్యమెటు లయ్యెడిదో యనుబెంగ కొంతదు
ర్వాదునమోసి యావగపుపాలయినాడ; కుమారికా నినున్
క్షీరములందు ముంతునొ; యిసీమరి నీటనె ముంతునో గదా ?

జయ:- అదియంతయు నా భావిజీవిత విధానంబున నాధారమైయుండ నెవ రేమి చేయగలరు ! దానికి విచారించిమాత్రము ప్రయో జన మేమున్నది ?

పులి:- అమ్మాయీ ! ఆ విషయంబున నేను మాత్రము బాధ్యుడను కానా ! నా కింకముందు కార్యభారమున్నది. అన్యరాజ్య కార్యంబు లటులుండనిమ్ము ప్రస్తుతము నీ పాణిగ్రహణ సందర్భమున నతి జాగరూకత వహించవలయునుగదా ?

జయ:- మంచిది, పోయిరండు.

పులి:- మాలతీ ! మీ నెచ్చెలికి ధైర్యంబు చెప్పుము. ఇట్టి విపత్కర సమయంబులందు యజమానురాలి చిత్తంబునకు నూరట చేకూర్చుటయకదా స్నేహితురాలి ధర్మము ?

మాల:- మహారాజా ! అవసరమయినచో నాప్రాణములనయిననూ ధారవోసి నెచ్చెలి సౌఖ్యమును కాపాడుకొందునుగాని, వేరుగ చరింతునా ? జయలక్ష్మీదేవిగారికే కొరతయు రాకుండ చూచుకొందును.

పులి:- మాలతీ ! సమయంబునుబట్టి నీకీమాట చెప్పితినిగాని, నీరాజ భక్తి నే నెరుంగనా ? నీ ప్రియసఖికి సంభవించిన దుస్థితిలో నీవును దుఃఖించుచు నప్రమత్తవై చరింతువేమో నని తిరిగి ప్రభోధించితినేగాని వేరుకాదు.

మాల:- మహారాజులు మాకు పితృతుల్యులుగదా ?

పులి:- సందేహమేమి ?

ఆ॥ వె॥ ధరణిజనులకెల్ల తండ్రిసముడనౌచు
రక్షణమ్ము సేయు రాజునేను
గర్భమందు గన్న కల్యాణి బ్రతుకెట్లు
సేతునో దలంప భీతిగల్గె.

కావున నేనింక వేగంబున బోయివచ్చెద. (నిష్క్రమించును)

జయ:- చెలీ ! నా జీవిత మెట్టి దశనందనున్నదోకదా ? నట్టేట నున్న జీవితనావ నన్నొక గట్టున చేర్చునో ముంచునో యను సందియంబు విడువకున్నది.

ఉ॥ కారణ మెద్దియైన నగుగాక ధరాధిపు నాజ్ఞచొప్పునన్
ధీరత బెబ్బులిన్ ధర వధించినవా డిటు రాకపోయె ని
ష్కారణమై వితర్కముల సల్పెడు భారము నాకిదేల ? పో
నీ రజకాధముండు కడునేర్పరియై నను మోసగించునా ?

మాల:- భయపడకుమమ్మా ! త్వరలో సర్వము తేలగలదు. అందు మనకు జయము లభింపగలదు.

జయ:- నెచ్చెలీ! నేడుగాకున్న రేపయినను రాకుమారుడు రాగల డను నమ్మికయే నాకును గలుగుచున్నది. అయినను అదెట్లు నిశ్చయింతుము? నా దురదృష్టంబున నా భాగ్యంబు లభింప దేని నేనొకటియే చేయ నిశ్చయించుకొంటిని.

మాల:- ఏదది?

జయ:- ఆత్మహత్య.

మాల:- ఆత్మహత్య మహాదోషముకాదా?

జయ:- కాదు. ఎంతమాత్రముకాదు. గత్యంతరము లేనపుడు హైంద వాంగనల కాత్మహత్యయే శరణ్యము.

మాల:- అందులకని...

జయ:- ఆలోచించితిని. లిప్పనితోటిదే వివాహము తప్పనిసరియైన నాన్న గారి వాగ్దానమున కంతరాయము రాకుండునటులు వివాహం బగువరకెట్టులో కన్నులు మూసికొని, ఆమరునాడె — శాశ్వ తముగ కన్నుమూయుదును.

మాల:- ( చెవులుమూసికొని ) అమంగళము ప్రతిహతమగుగాక.

(తెరలో):- అమ్మగారూ!

మాల:- చెలీ! ఎవరో పిలుచుచున్నారు—ఆలకింపుము.

(తెరలో):- అమ్మా! పులిని చంపిన రాకుమారులు రాజసభకు విచ్చేసినారట. మిమ్ములను మాలతీ సమేతముగ రావలసినదని మహారాజులవా రాజ్ఞాపించినారు.

జయ:- (సంతోషముతో) మాలతీ! వారువచ్చినారట - రాకుమారులే నట! భగవంతుడు నన్ను రక్షించినాడు సుమా.

మాల:- నేను చెప్పుచునేయుంటినిగదా. "నీవు సాక్షాత్ జయలక్ష్మి వేనమ్మా" అని—

జయ:- చాలులే నీవేళాకోళం. నాన్నగారియాజ్ఞ—

మాల:- నేటివరకు నాన్నగారి యాజ్ఞ మాత్రమే. నేటినుండి నాథుని యాజ్ఞనుకూడా పాటింపవలయును కాబోలు — నడువుము.

జయు:- మరినీకో ?—

మాల:- యువరాజుగారు—

మాల:- మన మిప్పుడుపోవుచున్నాము — రేపువారు వచ్చుచున్నారు పోదాంపద. (యిద్దరునిష్క్రమింతురు)

(తిప్పడొక ప్రక్కకుర్చిపై కూర్చుండి యుండును. పులిరాజు యథావిధిగ కూర్చునియుండ—బాలవర్ధిరాజు ప్రవేశించును)

బాల:- మహారాజా ! వందనములు.

తిప్ప:- (చూడకుండనె) చరె — కూకో.

పులి:- శుభంబగుగాక !

బాల:- మీ రాజ్యంబునగల మేటిపులిని—

తిప్ప:- (చూడకుండనే) యీ తిప్పడు నిన్ననే సంపేసిండు నీ కేంబయ్యం లేదులే కూకో.

పులి:- కడతేర్చితివా ?

బాల:- కాళ్లగోళ్లు కోసుకవచ్చానుగూడ. (అనిఅందించును)

పులి:- ( వాటినిచూచి సంతోషముతో లేచి ) ఆహా ! ఈనాటికిగద ధన్యుడనైతిని ? నాయనా చిరంజీవి ! నీ యూరిపేరు లేమిరాయె దెల్పుము.

బాల:- విదేశవాసిని వివరంబులడుగుట లోకాచారమేగదా ? అడిగిన వానికి బదులు చెప్పుటయు ధర్మముగదా; వినుడు.

ఉ॥ ఆరయ పానుగంటినగరాధిపులౌ అల కార్యవర్ధికిన్
కూరిమినందనుండ అనుకూలతతో నను బాలవర్ధియన్
పేరునబిల్తురయ్యా పృథివిన్ జననీజనకుల్ మరాటిచే
తీరనిబాధలంద చనుదెంచుచు మీ పురమేను జొచ్చితిన్

పులి:- ( సంతోషమున నాలింగనము చేసికొని ) నీవా బాలవర్ధి రాజువా ? నిన్నొక్కని చూచినంత మీ తండ్రులేడ్వురను మీ తల్లులేడ్వురను చూచినంత సంతోషమగుచున్నది. నీ వెరుం

గవుకాని నేను మీ కుటుంబమునకు చాలదగ్గరివాడను. దైవ విధానంబున మీ కుటుంబమున కెన్నియో యిడుములు సంభ వించినవి ఇకనామాటందువా ?

గీ॥ వేటయననాకు వినోదమాట
వనుల కేతెంచి యుల్లాసమున చరించి
శరము సంధింపగా గురిజారి కనవు
మేయు లేగకు నాటె "నంబా" యనంగ

అట్లు నా బాణంబుచే విలపించి మరణించిన బిడ్డను కనులార గాంచిన యాగోమాత కోపంబున ననుచూచి "ఓయీ ! పులిరాజా ! నీవీదినంబు మొదలెన్నడేనియు నాయుధంబు ధరింతువేని గురిచూడకముందె మరణింతువుగాక" యని శపించినది వత్సా !. తత్కారణంబున మీ తండ్రులకే సహాయంబును సేయలేకబోయితిని మరియును మారాజ్యం బున క్రూరమృగంబులును పెచ్చుమీరినవి. ఈ మదించిన పుండరీకము సామాన్యులచేత మడియకుండుటంచేసి అందు లకుం దగిన ధీరుడు రాచపట్టియే యగుననినమ్మి పుత్రులు లేని తదేకపుత్రికా తండ్రినయిన నేనాయల్లునికే నా రాజ్య మివ్వవలసినవాడనగుటచే నేనిటులు చాటించితిని.

ఉ॥ నీ విటక్రొత్తగాని మరి నీతల్లిదండ్రులు పాతవారె–మా
బావలెవారు అల్లుడవు వచ్చితి వింటికి–అందుపైన నీ
వీ విధి బెబ్బులిన్ బొడుచుటెంతయు నాకనుకూలమయ్యె న
న్నా! వెలదిన్ గ్రహింపుమిక నాసగరాజ్యముతోడ నెంతయున్

బాల:– మహారాజా! మీయాజ్ఞ నేనాచరింపదగినవాడనే, అయినను నాదొక్క ప్రార్థన కలదు అదేద్దియందురేని –

ఉ॥ కాదనబోను మీ హితవుగాని ననుం గనినట్టి తల్లి కా
మొగము గూర్పకుండ పడిపోయిన తండ్రుల చూడకుండ దా
యాదులు బంధుమిత్ర గురువాది సమస్త భటాళి బ్రీతిమై
నాదరి నుండకుండ యిటునామనసొప్పదు పెండిలాడగన్

కావున నేనా కార్యంబుల పూర్తిగావించుకొని తిరిగివచ్చెదను. అంతవరకు నా కాష్టయొసంగి దీవించి పంపుడు.

పులి:- చిరంజీవీ ! నీ యభిలాష ప్రశంసనీయము. నీ కార్యము సిద్ధించునుగాక! అనుభవంబు గలవాడ నగుట నీ కొక రహస్యమును చెప్పుచున్నాను. మాయలపకీరు మహామాంత్రికుడు. ఉపాయము నగాని యీ అపాయమును తప్పుకొనలేము. తమ్ముళ్ల పెద్ది పకీరు కోటలో పూలమాలలు కట్టు పనిమనిషి. అందరుపోగ మిగిలిన మనుమని నతిగారాబముగ పెంచుకుంటుండేది. పదేళ్ల ప్రాయము నాడు వాడు పలాయనమైనాడు. ఏడేళ్లక్రింద యిల్లువీడిపోయిన వీరయ్య నిపుడాపెద్ది గురుతించలేదు. నీవటకేగి నేనే నీ మనుమడు వీరయ్యనని చెప్పు దానిమూలమున పకీరు కోటలోనికి దారి కలిగించుకొని ప్రవేశించి యుక్తితో కార్యసాధనకు పూనుకొనుము. జాగ్రత్తగబోయి జయసమేతముగ తిరిగిరమ్ము.

బాల:- (చేతులు జోడించి) ధన్యుడను మామగారూ! మీరు సెలవిచ్చిన యీ యుపాయము నా కెంతయు సహకారమగును గాక. మీకు నే నాజన్మాంతము కృతజ్ఞుడను.

శా॥ మామా! మీ హితబోధ నా కిపుడు మేల్ మార్గంబు జూపించె మీ
రీమాడ్కిన్ నను బ్రోత్సహించుతరి నింకేమీ? తదీయాజ్ఞలన్
నా మూర్ధంబున దాల్చి ముందు చనుచున్నాడన్ జయశ్రీలతాం
గీ మా పక్షమునందు నిల్వ తమరున్ కేలెత్తి దీవింపుడీ!

పులి:- మే మందరమును వాంఛించున దదియేకదా!

శా॥ ఉత్సాహంబున తల్లిదండ్రులకు మేలొప్పార నేతెంచు నీ
ప్రోత్సాహంబు జగత్ప్రసిద్ధము-శుభంబుల్ ఫలింపంగ నా
మాత్సర్యున్ పరదారసంగ్రహణు దుర్మార్గున్ పకుప్ప్రాయు నో
వత్సా! పోయి మరాటిద్రుంపుమిక శుంభత్ శౌర్య గాంభీర్యతన్.

బాల:- ధన్యుడను.

( జయలక్ష్మి — మాలతి ప్రవేశింతురు. )

మాలతి:- మహారాజా! ఏలినవారి యాజ్ఞ ననుసరించి రాకుమారి విచ్చేసినది.

పులి:- అమ్మా! జయలక్ష్మీ! పులిని చంపిన వీరు డెవరో కాదు-మనకు దగ్గరివాడె-పానుగంటి పురాధీశ్వరులయిన వర్ధివంశజుండు-బాల నాగమ్మ కార్యవర్ధిరాజుల యేకైక కుమారుడు బాలవర్ధిరాజు.

జయ:- ధన్యురాలను (స్వగతమున) ఆహా! నేనింతకు ముందు తలంచిన వచ్చె చిన్నె లన్నియు నీ సుందరాంగునియందున్నవి కదా? యదార్థముగ నేనదృష్టవంతురాలనే.

గీ॥ నొసట గల వ్రాలు ముందుగ నోటబలుకు
నన్న సామ్యంబు సార్థక మయ్యె నిపుడు.
మది దలంచి వర్ణించిన మదనమూర్తి
కనులముందు నిక్కముగ సాక్షాత్కరించె.

బాల:- (తనలో) ఆహా! ఏమీ, యీ చిన్నారి సోయగము?

గీ॥ తలచలేదు యీ లలన సౌందర్య మేను
కాంచి యెరుగ మున్నెందు నా కనులతోడ
కారణాంతరమందు నీ కాంత పత్ని
గా బరసితి నా పూర్వభాగ్యంబువలన.

పులి:- వధూవరులారా! మీాకపకారము సేయ సంకల్పించిన దురాత్ముని చూచితిరా? ఒరీ, ఎవరక్కడ

( భటుడు ప్రవేశించును. )

భటు:- మహారాజా! భటున కేమి యాజ్ఞ?

పులి:- రాజద్రోహమునకు గడంగిన యీ తిప్పని గొనిపోయి ముక్కు-చెవులు గోసి, తలనిండ సున్నపు బొట్లు పెట్టి, గాడిదమీాద నెక్కించి యూరిలో నూరేగించుడు.

భటు:- చిత్తము.

పులి:- అంతియకాదు. చింతబెత్తముల దెప్పించి పదియడుగుల కొక దెబ్బ చొప్పున కొట్టుచు పోవలయును.

భటు:- చిత్తము.

పులి:- ఆగు. మరియు తైలమును సలసల క్రాగించి, ప్రతివీధిలో నొక్కకమారు వానిపై చల్లుచుండవలయును.

భటు:- చిత్తము.

పులి:- ఆగు. తేళ్ళను, మండ్రగబ్బలను పట్టి, దండగుచ్చి వానిమెడలో వేయవలయును.

భటు:- చిత్తము.

తిప్పడు:- (ఏడ్చుచు) మహారాజా! నన్ను మన్నించు మరాజా! బుద్ధి వచ్చింది-మన్నించు-మన్నించండి. (చెంపలు వేసికొనును)

పులి:- ఛీ దురార్గుడా! నిన్ను క్షమించుటయా? పొమ్మావలకు.

బాల:- మహారాజా! ఇతనిని రక్షింపరాదా?

పులి:- వీడు క్షమార్హుడు కాడు నాయనా!

ఉ॥ నీవు వధించినట్టి పులినిన్ దరిజేరి భయంబులేక-నె
ట్లోవడి మొండిగోళ్ళను పటుత్వముగా గొనివచ్చె వీడు దు
ర్భావముతోడ రాసుతనె పత్నిగ బొందదలంచి వచ్చినట్టి పా
పీ విధి రాజదండనము వేగమ నొందక బాయునొప్పనే

బాల:- మహారాజా! మన మిట్టి మహదానంద మనుభవించు సమయ మున నితరులు చింతింపరాదు. దయయుంచి వానిని క్షమించండి.

పులి:- ఓరీ తిప్పా! నీ వెవరి కపకారము సేయబూనితివో- అతడే నీ పాలిటి కిపుడు భగవానుడైనాడు. ఇకముం దిట్టి బుద్ధితక్కువ పనులు చేయక జాగ్రత్తగ సంచరించుము. పొమ్ము.

తిప్ప:- సిత్తంబాబూ! (నిష్క్రమించును)

పులి:- అమ్మా! జయలక్ష్మి! మీ యత్తగారిపుడు మాయలమరాఠీచే నపహరింపబడి నిర్బంధనలో నున్నది. బాలరాజా తల్లిని చెర

విడిపింప నేగుచున్నాడు. ఆతడు తిరిగివచ్చినతోడనే వివాహ మాడెదనని దెలుపుచున్నాడు.

జయ:- ఆర్యపుత్రులవారి కార్యదీక్ష కంతరాయము గలిగించుట న్యాయమా నాన్నా? వారి యభీష్టము ప్రకారమె కానిండు.

పులి:- నాకును అదియేయిష్టము. విఘ్నాంతరములు లేకుండ నేనుమాత్రము వివాహము సేయుట మంచిది కాదుగదా?

జయ:- నాయనా! నీ కే సహాయమేని కావలసియున్న గోనిపొమ్ము.

గీ॥ రాజ్యమందు సర్వాధికారంబు నీది
స్వేచ్ఛమయవర్తనమున లోటేమిలేదు;
అల్లుడవునైన తనయుండవైన నీవె
కాన, కొనుమయ్య దేనిపై కాంక్షయున్న.

బాల:- మహారాజా! నా స్వతంత్రమునకు మీ రాటంకపరచుదురని నేను సందేహించుటలేదు. పకీరు మాంత్రికుడుగాని రణవీరుడు కాడు. వానిని జయించుట కంతకుమించిన యుపాయమే కావల యునుగాని యీ సైన్యము లేల? సమరసన్నాహము లేల? కావలయునన్నచో పానుగంటి పురమునుండియే ప్రబల బలగం బులతో రాకుందునా?

పులి:- బాలవర్ధీ! సత్యమును వక్కాణించితివి. ఒకవేళ నెదేని సందర్భ మున సేన లవసరమైనచో నాకు తెలియచేయుము. వెంటనే మన సేనాధిపతితో నీకుం దగిన సహాకారమును బంపెద.

బాల:- అన్నిటి కంటెను మించిన మీ యాశీర్వాద ముండగ నా కింక కావలసిన దేమున్నది?

పులి:- నాయనా నీ వినయ గుణసంపత్తియే నిను రక్షించునుగాక! అమ్మా జయలక్ష్మీ! వేరొక కారణంబుచే పెండిలి కాకపోయి నను నీ వీనాటినుండి పానుగంటి పట్టాపు యువరాణివే నను మాట మరువకుము.

సీ॥ పానుగంటి పురాన వర్ధివంశీయులు
నింపారు నీ పుట్టినింటివారు;
నాగేంద్రుని వరంబున జనించె బాలనా
గమ్మ ధరిత్రినీ కర్తగారు
అపకారమేనాడు నాచరింపగరాని
మహికార్యవర్ధి మీ మామగారు;
ధీర వీరాది గంభీరవదనుడైన
బాలవర్ధియె నీదు భర్తగారు;
గీ॥ మానసంబున గురుభక్తి మరువబోక
నిత్యశీల సంపద లంది నెగడు నటులు
దైవకోటిని ప్రార్థించి దనరుమమ్మ
కొరత లేని విజయలక్ష్మి కూడుకొనుడు.

జయ:- మహాప్రసాదము.

బాల:- మామగారూ! నాకింక శెలవా?

పులి:- మంచిది పోయిరమ్మా.

(తెర జారును)

# బాలనాగమ్మ

## (షష్టమాంకము)

(మరాఠికోట - మరాఠి తప్పత్రాగి తూలుతు కూర్చుని వుంటాడు - వీరయ్య వేషంతో బాలవర్ధిరాజు ప్రవేశము)

మరా:- అరేయ్ ! కుఱ్ఱవాడూ! అవ్వేదిరా అవ్వ ?

బాల:- అవ్వా ? అవ్వమంచంలో గువ్వలాగ పండుకొన్నదండీ !

మరా:- ఏం? ఏదయినా రోగం వచ్చిందా ?

బాల:- మాయగవచ్చింది మారాజా ! ఆ రోగ మేం రోగమో ? మాయరోగం. మాప టేల మనిషికూడుతిన్నది - సిటికలో లెగిసి శాకిరంతా చేసింది — మద్దాల అయేసరికి మంచంమీాది కెక్కింది — నడువలేనంటూ నడ్డివాల్సింది.

మరా:- ముసలితనంలో వచ్చినరోగం మొండివ్యాధిరా మొండివ్యాధి. కొద్దిరోజుల్లో కుదిరేదికాదు. అయితే మరిమాకు మాలలుకట్టి యిచ్చేపని మానుకొంటుందా ?

బాల:- అక్కరలేదండి. అవ్వదండలకంటె అందంగ కట్టుతాను మాది రికి తెచ్చాను. మహారాజులు పరిశీలించండి. (దండలు చేతి కందించును)

## కీర్తన:

బలెబలె రాజా ! బంగరురాజా కలకలలాడే దండలు కట్టెదనో రాజా ॥బలె॥ జాజి, విరజాజి, సన్నజాజి రోజాపూలతో; మోజుమోజుగా, రోజురోజుకూ, గాజువన్నెల చెమికీ — నాజూకులొలికే మాలలు కట్టెదనో రాజా! పూమాలలు తెచ్చె.

దనో రాజా ॥బలె॥ చామంతి, బంతీ, పూబంతులతో దొంతులు దొంతులుగా వింతవింతలుగా, సంత కేగిన పంతము లాడే మాలలుకట్టెద రాజా! సుమమాలలు తెచ్చెద రాజా ॥బలె॥ మనసులేని మగువలునైనా, మమతలేని మగనినైనా ఘనమైన నా మాల—కనుగొంటె నేచాలు వలచి, పిలచి వడిలోకులకాలి—కలిసి, మెలిసి సరసన నిలువాలి ॥బలె॥

మరా:- (నవ్వుకుంటూ) బలె బలె కుఱ్ఱవాడా! బాగాకట్టావురా! బలె బాగాకట్టావు. పొంకంగ బింకంగ పూలదండనుచూ_స్తే నా మనసు వచ్చిందిరా. నచ్చాను, నచ్చాను – కనుక నిన్ను మెచ్చాను — మెచ్చాను కనుక బహుమానమిచ్చాను — ఇచ్చాను కనుక యిటువచ్చి యిదిపుచ్చుకో (అని రత్నహారము నిచ్చును)

బాల:- మగవారి మెప్పులో మహ_త్తరమేమున్నది రాజా! ఆడవారా దండలుచూడాలి — ఆడుకుంటురావాలి ముస్తాబులై మీకు ముద్దులివ్వాలి.

మరా:- అంతవాడవటరా అసాధ్యపు పిడుగా!

బాల:- పనితనం చూడాలంటే పరీక్షించవచ్చును పకీరుగారూ! పదు నాలుగేళ్ల నాటనుండి పశ్యానికిరానిపండు — పంజరంలో పట్టు బడినను పలుక నొల్లని చిలుక దక్కిన్ను రేపే దారి కొస్తుంది' ముక్కు పట్టుకొని మిమ్ము ముందుకు గుంజుతుంది. బాలనాగమ్మ గారున్న బందిఖానలోనికి నన్ను పంపించి చూడండి–నా దెబ్బ చూపిస్తా. వశీకరణ మంత్రమో, వాలెరిగిన తంత్రమో ముగ్గ మీదకు రప్పించకపోతె మూతిమీసం తీయించుకొంటా.

మరా:- మాటలపసేనా? మంత్రాలపసకూడానా? చేతగాని ప్రజ్ఞలు చేస్తే చెడిపోతావురా, అబ్బాయీ! చెడిపోతావు. సందేహ ముంటే సాహసించకు – నిగ్గించగలిగుంటేనే నిలిచి మాటాడు.

బాల:- మంత్రబలముంది – యంత్రబలముంది. మాటల నేరుపుంది – మార్చే సూత్రముంది. అసలైన క్రియలున్నాయి – నసిలైన

పసరులున్నాయి. కట్టుకట్టుతానంటున్నాను – కట్టు కట్టలేకపోతే పట్టు పడతానంటున్నాను. బొంకుకాదు – శంకలేదు. కిటుకేందో సిటికలో సూడు.

మరా:– బలేవాడివిరా కుఱ్ఱవాడా! బలేవాడివి. మనసులోనున్న కోరిక మనకు సాయమయితె మాణిక్యాలతో నీకు మహాలు కట్టిస్తా. పట్టుకొచ్చిన లేడి ప్రక్కకు వచ్చినిలిస్తే నిన్ను పట్టుచొక్కాలు తొడిగించి పట్టపేనుగెక్కిస్తా. కథ చెదరకుండ – పథకం మారకుండ పట్టింది బంగారమయితే యిస్తానన్నది యిస్తా – చేస్తానన్నది చేస్తా. ధైర్యముంటే దగ్గరకువచ్చి గడువెంత కావలయునో అడుగరా, గడుగ్గాయి పిల్లవాడా!

బాల:– పకీరువారి మాటకు పొరపాటు రాకుంటే – వీరయ్యమాటకు వెనుకబాటే లేదు. మందైన, విందైన మూడు పూటలె. మెచ్చు చూచినరోజే మెచ్చుకొంటారు. మనసులో తలచిన మేలకన్న మంచిదెలేదు – మనకిచ్చిన వాగ్దానం మరచిపోవద్దు. మూడురోజుల్లో నీ పెళ్ళి ముగించేస్తా.

మరా:– అయితే రారా, వీరయ్యా! ఆ ఖైదు చూపిస్తాను.

బాల:– (ఆలోచనతో) ఒంటరిగ నన్ను పంపిస్తారా? వెంట మీరుంటారా?

మరా:– వెంట మేముంటే తంటా యేమయిన వుంటుందా?

బాల:– తంటా అంటే తంటా? తల్లక్రిందులయ్యే తంటా. మూడో చెవులోబడితే మంత్రం ముక్క పారనేపారదు. నా కష్టమంత నాశనమైపోతుంది. అదిన్నిగాక ఆలోచించితే – నా తంతరం నీ ముందు చూపిన తరువాత నా కింక బ్రతుకు తెరువుందా? ఒద్దుబాబూ! వొద్దు. నీకు దణ్ణం – నీకోట కొకదణ్ణం. మాలలు కట్టుకొనైన మహారాజులా బ్రతుకుతాను. (వెళ్ళబోవును.)

మరా:– (నవ్వుతు) ఉండరా, ఉండు. ఉడుకుబోతులాగున్నావేమిరా! నేను రానుగాని, నీవే వెళ్ళు. నీ స్వంత పనిలాగ యీ పని నెరవేర్చుకో. (తాళాలు వీరయ్య చేతికిచ్చును)

బాల:- నిజంగ నీమాట నెరవేర్చి నీవద్దకు వస్తాను. (వెళ్ళినట్లు వెళ్ళి మళ్ళీవచ్చి) మరోమాటడగటం మరిచిపోయానండి.

మరా:- మాటడగటం కాదు - బాటడగటం మరిచిపోయావేమొ ? దారి తెలియక తిరిగివచ్చావా ?

బాల:- ఇంతవరకు తెలుసుకొన్నవాడిని యీ కాస్త తెలుసుకొనలేక పోతానా? మరుగులో వుండి నీవుకాని, నీవారుకాని నా మాట వినరాదు. నా గురువాజ్ఞ మీరితే నామంతరం పనిచేయదు. గట్టిగా రామని వొట్టేసి చెప్పండి.

మరా:- ఓవ్! మహంకాళిమీద వొట్టేసి మాటిస్తున్నాను పో.

బాల:- సరె (పోవుచుండును)

మరా:- ఒరేయ్! అబ్బాయీ!

బాల:- వెళ్ళేవాడిని వెనుకకు పిలిచారేం ?

మరా:- మరేంలేదు - మాటాడాలి.

బాల:- అదేమిటో ?

మరా:- రేపు బాల నాతో రాజీకి వస్తుందికదూ ? అందాక నిన్ను కూడ బందీచేస్తాను.

బాల:- భగవంతుని నమ్మినవారికి బయమేముంది రాజా! వస్తా.

( తె ర బ డు ను. )

( చెరసాలలో బాలనాగమ్మ )

నాగ:- ఔరా!

ఉ॥ కష్టములెల్ల దీరి, చెడుకాలము మారుటచేతనే మహా
దృష్టత మేనమామకు సతీమణినై - సిరులొంది - పుత్రు ను
త్కృష్టుని గంటి, మోదమున తేలెదనంచు దలంతుగాని యీ
దుష్టపకీరు పన్నుగడతో విలపించుట నెంచ నక్కటా!

నా మూలమున నెందరి కెన్ని యిక్కట్టులు సంభవించినవి ?
ఆనాడు మా సవతితల్లి మాణిక్యాలదేవి మాయోపాయంబుల

నుండి బ్రతుకక నాడే మరణించిన బాగుండెడిదికదా; బ్రతికినను యిన్ని బాధలురావలెనా ?

సీ॥ మాయదారిరణంబు మా కాతరిని గండి
కోట భూపతులతో కూడనేల?
నా నాథునకు రణన్యాయము ముద్ఘాటించి
పదపదమంచు నే బంపనేల ?
దొంగజంగంబును దొడ్డవానిగ నెంచి
గీటులానాడు నే దాటనేల ?
కోరినసతులుండ కుమతియై పీడిందు
దిట్టత నన్ను బంధింపనేల ?
గీ॥ కయ్య మొనరింప మా పానుగంటి నృపులు
ప్రతిమలై ప్రాణకోటిని బాయనేల ?
మొండిజీవంబు ననువీడి పోవదేల ?
బ్రతుకనేల ? యీ యెడలేని బాధలేల ?

నాథా! కార్యవర్ధిభూపాలా! పతియాజ్ఞ నుల్లంఘించి పరాయి వానిచే తస్కరింపబడిన యీ దౌర్భాగ్యురాలిపై దయదాల్చి వచ్చితివా? అనుదినము నా మోహపాశాబంధితులై; నన్ను వీడియుండని మిమ్మానాడు యుద్ధభూమికి వెళ్లువెళ్లుడని బలాత్కారముగ నంపించిన దీ పాపాత్మురాలే కదా? నాయట్టి నిర్దయస్వాంత - భర్తృపరిహాసిని - మరెందైన నుండునా? ఇంత నీచురాలి నగుటచేతనే నా మోము చూడనొల్లక; నా పలుకులు విన మనసొప్పక యీ శిలారూపము నొందితివా నాథా! "నిన్ను విడనాడి చనజాల నిజముబాల" అంటిరే— "ప్రేమ ప్రతివారికి మధురప్రాయ"మనంటిరే— నా సౌందర్యమునకు మీరు నా బందీనైతినని బలికితిరే ? ఆ మాట లిపుడేమైనని మహారాజా ! రాజభవనంబులనుండి మిమ్ము రణరంగమునకు గెంటిన యీ రాకాసి—ఖడ్గము నిచ్చి కయ్యంబునకు వంపించిన యీ కసాయిమానసి— మీ మాటదాటి మీ కోట

పీడిన యీ మహాపాతకికీ శిక్షకావలసినదే. మీ పరువు మరి
యాదలను పాడుచేసిన యీ పాపి నేల రక్షింపవచ్చితిరి ?
బాలనాగు నాకింక లేదని బదులు చెప్పకొనలేకపోయినారా ?
మనసు మార్చుకొని మళ్లీ పెళ్లాడకపోయినారా ? క్రొత్త
భార్యతోనయిన కుశలముగ నుండెడివారలే మొగడ ! మన
బాలవర్ధికి తల్లి లేకున్నను తండ్రియైన యుండియుండెడివారే
అయ్యో ! మాలదైవమా ! నాకతంబున నాతో బుట్టువు లార్వుర
కున్ వైధవ్యమును గలిగించితివా ? అయ్యో ! కుమారా !
నా గర్భమున బుట్టినందుకు తల్లిదండ్రులులేని బిడ్డవై పెరుగు
చుంటివా నాయనా !

చ॥ కడుపునబడ్డనాడు చెలికత్తెలు నవ్వుచువచ్చి "రాకుమా
రుడె జనియించు మీ"కనుచు రూఢి యొనర్చుచు ముచ్చటాడిర
ప్పుడు నినుగూర్చి యోతనయ పుట్టగ నీకనుకొన్న వాటిలో
కడ కొక వేడుకైన నటగాంచగలేని దరిద్రమందితిన్.

బాల:- (ప్రవేశించి) అమ్మా ! అమ్మా !!

నాగ:- (కోపముతో చివాలునలేచి) ఎవరవు కొడుకా నీవు ?

బాల:- నేనేనమ్మా ! నేను—బాలవర్ధినమ్మా ! నీ కొడుకుని.

నాగ:- చాల్లే దూరముగవుండు. అడుగు ముందుకు వేశావా అంత
రించిపోతావు. జాగ్రత్త.

బాల:- అదేమిటమ్మా ! అలా ఆగ్రహించుచున్నారు ! కొడుకుమీద
నింత కోపమెందుకమ్మా ! చావుబ్రతుకులు తప్పించుకొని
చాలశ్రమపడివస్తే చిరాకుబడి చీదరించుకుంటావేమమ్మా !
కన్నకుమారుని కంటచూడలేక విడిచిపెట్టి రాకపోతే ఆనాడే
చంపేసి రాకపోయినావటమ్మా !

నాగ:- కట్టిపెట్టు మింక నీ కపటవినయంబులు.

శా॥ ఓరీ! దుష్టుడ! దుర్మదాంధ! నను మాయోపాయమున్ బన్ని యీ
కారాగారమునందు చేర్చితివి నిన్ కామింపకుంటన్ దలం

చీ రూపంబున నేగుదెంచితివి నన్నెట్లో స్పృశింపంగ నో
క్రూరా! దూరము పొమ్ము లేనియెడ బుగ్గింసేతు శాపంబునన్.

బాల:- (జాలిగ) తొందరనొందకుమమ్మా !

ఉ॥ అమ్మ ! సుతుండనమ్మ ! భయమందకుమమ్మ ! త్వదీయ పాద
పద్మమ్ము లెరింగి భక్తిని నమస్కృతులంటిగదమ్మ! నేను
నిక్కమ్ముగ బాలవర్ధిననియే వచియించితినమ్మ! మా
యమ్మ! మదీయ దీక్షకు సహాయమునిమ్ము సుఖంబు పిమ్మటన్.

నాగ:- మరాతిపీనుగా! నీ మాయలు తెలియవనుకొంటివా ? ఆనాడు జంగం వేషమున వచ్చి నన్నపహరించితివి. ఈనాడు బాలవర్ధి రూపంబున వచ్చినను మోసగింప నెంచుచుంటివి. నన్నీసారి నమ్మించలేవు - ఏనాడూ వంచించలేవు.

బాల:- (చెవులు మూసికొని) హరిహరీ ! ఆమాటనకుము తల్లీ ! అనుమానించకుమమ్మా! నిన్ను తప్పక తీసుకవస్తానని మా పెద్దమ్మలార్వురకు మాటిచ్చాను. "అమ్మా! అమ్మా" అని అనుక్షణము తపించుచు వచ్చాను. కనపడ్డ దేవతలందరికాళ్ళకూ మ్రొక్కాను. దేవి వరమిచ్చింది. మరేమీ భయంలేదు - మాటాడవమ్మా!

నాగ:- అయ్యో దైవమా! వీనిని చూచిన నా కుమారు డూరక జ్ఞప్తికి వచ్చుచున్నాడు. నాహృదయము నొతెబంధించుచున్నను మాతృప్రేమతో ముందున కేగుచున్నది. ఒకవేళ వీడు నిజముగ నా బిడ్డ బాలవర్ధియగునా? మరే! నాకంతటి యదృష్టముకూడనా?

బాల:- (సంతోషముతో) నామాటలు నమ్మావా తల్లీ! నన్ను సంకల్ప సిద్ధుని చేసితివా తల్లీ! ఆలోచిస్తున్నావేమిటమ్మా! అమ్మా! ఆనందంగ - ఆప్యాయంబుగ - ఆ అమృతహస్తాలతో నాశీర్వదించవమ్మా!

నాగ:- ఆం! ఆం! ఆగు.

శా॥ ఔరా! ఎంతటి ద్రోహబుద్ధివిర మాయా వేషధారీ! మహా
వీరుల్, ధీరులు పానుగంటిన్నపు లే వీక్షించుసంతన్ శిలా

కారంబుల్ ధరియింప నింకెచట నాకన్నయ రాగల్గె? ప్రా
కారం బెట్టులు దాటగల్గె? నెటు లింకన్ నన్ కనన్ గల్గెడున్?

బాల:- కాదమ్మా! కలవరపాటు చెందకుమమ్మా! ఆనాడు వుయ్యాల తొట్టిలో నన్నుబరుండబెట్టి ముచ్చటకై యీ రత్నహారం నామెడలో వైచినావట. ఆనాడే మీకీ యవస్థతటస్థించినదట. నీ యన్వేషణకు నేను బయలుదేరుచుండ మా పెత్తల్లులాలోచించి అవసరమయినచో నానవాలుగ నుండుటకై నా చేతికిచ్చి యీ విషయంబును వివరించిరి. ఇటువచ్చి యీ రత్నమాలను పరిశీలించి నీ యనుమానము బాపుకొనవమ్మా!

నాగ:- అంతమాత్రమున నమ్ముట కవకాశమెక్కడిది? నీవే నాటకమైనను నేర్పుగానే నటించగలవు. నిన్ను నేను నమ్మను – నమ్మలేను.

బాల:- అటులనిన నేనేమి చేయుదునమ్మా?

మ॥ అనుమానింపకుమమ్మ! యీ పగిది నిన్నర్థించినన్గాని న
మ్మనినాడెట్టుచరించు నీ తనయుడమ్మా! జాలిమై నాదు ప్రా
ర్థన లాలింపవదేని నా పలుకు సత్యంబయ్యు నీరీతి పు
త్రుని కష్టంబులు వ్యర్థపుచ్చుటయె కాదో నీదు సందేహముల్.

క్షమింపుమమ్మా! నీవు మహాపతివ్రతవుకద? నీ పాతివ్రత్యము నిష్కల్మషమైనపుడు నీకీ మంచిదినంబులెందుకు రాకూడదు? ఆ నమ్మిక మీకేల లేకపోవలయును? నీగర్భంబున జన్మించిన రానుంతుడు శత్రుసంహారమును మాతాపితృ సంరక్షణమును సేయగల సమర్థుడేల కాకపోవలయును? నీ కుమారుడిందు రాజాలనంతటి యసమర్థుడేలకావలయును? వేయేల? నీ సౌశీల్యమునందు నీకంత నమ్మికయున్నచో నన్ను నీ కుమారుడనని నమ్ముము, లేకున్న ....

నాగ:- (కోపముతో) ఆగు! మూర్ఖా! ఏమని ప్రేలుచుంటివి? అయినను నీ మాటయం దెంత సత్యమున్నదో పరిశీలింతును. (పరిశీలించిచూచి) ఓ మాయావీ! ఈ రత్నమాల నాదియె. అంత

మాత్రమున నీవు బాలవర్ధివని నమ్ము టెట్లు? నన్నే దొంగ తనంబున గొనివచ్చినటుల నా హారమును మాత్రము గొని రాలేవా? ముసలిజంగముగ మారిన నీవు యువకరాకుమారునిగ నటించలేవా? అపుడన్ని మాయలాడిన నీకీబొంకులు చేతగానివా?

బాల:- అమ్మా! ఇంకను నీ పరీక్ష పూర్తికాలేదా? అయిన నేనింక కన్నీటితో యింటిదారి పట్టవలయునా?

సీ॥ కన్నతల్లియుతండ్రు లెన్నో బాధలనుండ
హాయి నేనెటు లింటి కరుగువాడ?
నిన్ను జూచియు, మేలు నీకొనగూర్పక
పురి కే మొగంబున బోవువాడ?
అట కేగ పెత్తల్లు లార్వురు "చెల్లిరా
దేమ"న్న నెటు వచించువాడ?
చినపెద్ద లంద రిన్నీ నీవు పోనేల
పరువుచేటన నేమి బలుకువాడ?
గీ॥ కన్నతల్లి దండ్రుల నింత కాచుకొనక
మించి సామ్రాజ్య మెట్లు పాలించువాడ?
యిట్టి లోభి - మరలి యింటి కేగనేల?
బ్రతుకె బనియేమి నావంటివాడు మాత!

నాగ:- (కోపముతో) ఛీ! దుర్మార్గుడా! ఇంకను నీ కపటనాటకంబును మానవైతివిగదా? అటులయిన నిదిగో. నీ ప్రాణముల గాచు కొనుము. (హారమును చేతధరించి - కనులుమూసి) ఓ నాగే శ్వరస్వామీ!

సీ॥ నీదు పడగనీడ నిదురించు శ్రీహరి
సర్వేశ్వరుం డౌట సత్యమేని?
నిన్ను గంఠంబుగా నిగమంబుల లిఖించు
కమలభవుడు సృష్టికర్తయేని?
నిను పూలమాలగా నిరతంబు మెడదాల్చు
ఫాలాక్షుడు మహాతపస్వియేని?

సీ మూర్ధమున నిల్పి నిఖిలభూవలయంబు
క్షేమంబుమీఱ రక్షింతువేని ?

గీ॥ నీ ప్రభావంబు నిత్యమై నెగడునేని ?
నీ వరంబున నేను జన్మించితేని ?
నీవు యీ రత్నమాలలో నేడు వెలసి
వీని నాగేశ్వరా! కాటువేయుమయ్య!

బాల:- మంచిది తల్లీ! మంచిది. (కనులుమూసి చేతులుజోడించి)

గీ॥ బాలనాగమాంబా కార్యవర్ధిపతుల
కాత్మజుడనేని - నిత్య సత్యవ్రతుండ
నేని, నాగేశ్వరా! రమ్మిదే మదీయ
కంఠసీమ పూమాలగ గ్రాలుమయ్య !

(బాలనాగమ్మ వైచిన హారము పూలమాలగ బాలవర్ధిమెడలో బడును.)

నాగ:- నాయనా! బాలవర్ధీ! (సంతోషమున నాలింగనము జేసికొనును)

బాల:- (కన్నీరు తుడుచుచు) అమ్మా! విజయం చేకూరుతుంది. విచారించకుము.

నాగ:- నినుబోలు బిడ్డల గన్నతల్లి నిజముగ సుఖింపకుండునా తండ్రీ!

మ॥ నవమాసంబులు మోసి నిన్ గని మున్నాళ్లేమి నీ ముద్దుమో
ము విలోకించితి నంతెగాని మరలన్ "పుత్రా" యటంచెన్నడే
ని వినోదంబున ముచ్చటాండు గనదీ నీ తల్లికై యింత దూ
రవిదేశంబుల కేగ నిన్నకట దూరన్ గల్గితిన్ పాపినై.

బాల:- అమ్మా! అందునుగూర్చి మీరేమియు చింతనొందకుడు. అందు వలన నీ మాయమరాటి నిన్నెంతటి మాయోపాయముల వేధించుచుండెనో బోధపడుచున్నది. ఇపుడు నా విచారము నీ కొదవిన యీ దురంత విషాదజీవితమును గురించికాని, నన్నాడిన నిష్టురోక్తులను గురించి కాదు. మరియు,

మ॥ నెలవా దుష్టునికోట - యీ దినము లేనిన్ మంచిగా లేవు - యి
ప్పలుకుల్ గోప్యము లింకపై - తరుణమా స్వల్పావకాశంబు ని
ష్ఫలమై దుర్గతి నొందబోవుతరి విశ్వాసంబు గల్గింప లో
దలచేమో వచియించినాడ జననీ! తాల్మిన్ ననున్ సైపవే.

నాగ:- నాయనా! తనయుని తప్పులను తల్లిసైరించని దెద్దియేని యుండునా? మాతృహృదయంబునం దెప్పుడు సహనముండక సాధింపులుండునా? తండ్రీ! మన యింటివద్ద నందరు క్షేమముగ నున్నారా?

ఉ॥ అమ్మ గతించె నన్న కొర తాత్మకు గల్గనీక - నన్ను నె
య్యమున గన్న యక్క లట నందరు క్షేమమె? అట్టి పుణ్యహ
స్తమ్ములె నిన్ను నిట్ మరల సాకినవన్న! నిరంతరంబు పె
ద్దమ్మలయందు భక్తివినయంబుల వర్తిలుచుంటివే గదా?

బాల:- అమ్మా! నీ యభిమతమునకు వ్యతిరేకమగునా? అమ్మా! మన కిది విశ్రాంతి సమయముగాదు. ముందు మనము సమయోచితోపాయమున నడువకున్న నపాయంబునకు గురికాగలము. కావున తొలుత నావిషయంబు నారయుము.

నాగ:- అవును తండ్రీ! ఈ మదాంధుని బాధలు సహింపలేక నేనొక వ్రతాచరణయం దుంటిననియు, అందులకు పదునాలుగేళ్ళు గడువున్నదనియు బొంకి యింతకాలము జరిపితిని. ఆ గడువింక మూడుదినములలో ముగియనున్నది. తరువాత గత్యంతరము లేకున్న నాత్మహత్యయే సిద్ధమనుకొంటిని.

బాల:- అమంగళము ప్రతిహతమగుగాక. అఘాయిత్యమునకు సాహసించకు తల్లీ! నీవు నాకొక సహాయమొనరించెదవేని నే నీ కార్యమును సాధింతునమ్మా!

నాగ:- ఏమది నాయనా!

బాల:- పకీరు ప్రాణరహస్యం తెలుసుకోవాలి.

నాగ:- అదెలా సాధ్యమవుతుంది నాయనా!

బాల:- మాయలమరాఠీ చేసిన మోసమే మనము చెయ్యవలయు నమ్మా! దుష్టసంహారమునకై మున్ను శ్రీరామచంద్రుడు చెట్టుచాటున దాగలేదా? దొంగను పట్టుటకు దొంగయే కావలయునన్న సిద్ధాంతమున నే నీ మాయావిని, మాయచేసియే యిటు వచ్చితినమ్మా!

నాగ:- (ఆలోచించి) ఇంతకుముందొకమారతని ప్రాణరహస్యము విని యుంటినిగాని జ్ఞప్తికి వచ్చుటలేదు. ఏమిచేయుదును?

బాల:- అమ్మా! అతనితో మంచిగా నే మాటాడాలి - మాటలమధ్యలో మభ్యపరచి మరుగు తెలుసుకోవాలి - రేపు తమ్ముళ్ళపెద్ది యిక్కడకు దండలు తెస్తుంది. ఈ దండ బాగులేదని మీ రద్దానిని తిరిగి పంపుతు అందొక మొగలిరేకుపై నా కా గుట్టు వ్రాయాలి.

నాగ:- ఆc!

బాల:- ఆc! అని అనుమానించకుమమ్మా! నే నొక గొప్పగారడి వనియు, నాచట్కాతో నాగమ్మను నీ వశంచేసి వస్తాననియు మరాఠిని మోసగించి వచ్చానమ్మా! కాకున్న నే నీ ఖైదీ దాక రాగలనా? నీతోనిలిచి మాటాడగలనా? నా ప్రార్థన లాలకించి నాటకమాడకపోతే శీలమర్యాదలనే కాకుండ జీవాలనుగూడ కోలుపోతాము.

నాగ:- పోనీ, నాయనా! ప్రాణములనేనియు బాయుదునుగాని, ఆ కఠినాత్ముని మోముచూచి నేను మాటాడనా? నాచేతగాదు తండ్రీ!

బాల:- అట్లనరాదమ్మా! నీ విపుడట్లు నటించనిచో నామాట వానికి మోసముగ దోచును. దాన నతండేమైనను నను చేయగలడు. నేను వాని మరణోపాయమాలించు నవకాశముండును. నా కార్యసాధనకేనియు నీవు నా ప్రార్థన మన్నింపవలయును తల్లీ! మరియు వాడి యాయుర్దాయము భంగమందకున్నచో ముందింక నెందరు సుందరుల నిట్లు హింసించునో గదా? సాటి నారీలోక

మును రక్షించుటకేనియు నా ప్రార్థన ననుసరించక నీకు తప్ప దమ్మా!

బాల:- సరే, నాయనా ! శ్రద్ధగ ప్రవర్తింపుము.

గీ॥ నీదు రాకకై ప్రాణాల నిలుపుకొనుచు
మూడునాడు లెట్టులో ప్రొద్దుబుచ్చుకొందు;
గ్రన్నన తిరిగి నీవు రాకున్న - నీదు
తల్లి నిక్కంబుగా నీకు దక్కదయ్య!

బాల:- బాలవర్ధిరాజు నీ సౌఖ్యమునుగూర్చక సన్యాచింత చేయుడమ్మా!

ఉ॥ రాముని కార్యమందు కపిరాజొక సంద్రముదాటెగాని; నా
నామరియేడు సంద్రములనై ననుదాటనె ? మర్కటంబులా
రాముడు, లక్ష్మణాదు లల రావణుజంపినటుల్ మరాటి నిం
కీమహిగూల్తు, నాయము నొకింత విభీషణువో లెజేయుమా !

నాకింక శెలవొసంగుము వెళ్లివచ్చెదను.

నాగ:- శుభముగ బోయిరమ్ము.

బాల:- సంకల్ప సిద్ధుడనై సత్వరంబుగ వచ్చెదనమ్మా ! (నిష్క్రమించును)

నాగ:- (చేతులుజోడించి) నాగేంద్రస్వామీ ! నాగేశ్వరుండు నమ్మి భజించిన వారిని బ్రోచుదయామయుడనుటకిది తార్కాణము గదా ?

మ॥ పదునాల్గేండ్లు గతించుచున్నవి; వ్రతంబామూడురాత్రంబు లా
పిదపన్ రక్షణగల్గబోవదని భావించెట్లొచావంగ నా
మదిలో నెంచుచునున్న నాతనయుడీ మాతాభిమానంబు పెం
పొదవన్ వచ్చెడుకాన కార్యఫలితంబున్ గూర్చి నాగేంద్రుడే.

ఆహా ! నేడెంతటి పర్వదినము ?

మరా:- (ప్రవేశించి) బాలా ! ఏమిటా పర్వదినము ?

నాగ:- మూడుదినంబులలో నా వ్రతము ముగియనున్నది. పదునాలుగు గేండ్ల నోముఫలితము అనుభవింప బోవుచుండగ...

మరా:- అలాగా ? ఆ ఫలితమేమిటో ?

నాగ:- జోశ్యులు చెప్పిన జాతకఫలం.

మరా:- జాతకం ప్రకారం జీవితం నడుస్తుందా ?

నాగ:- జరిగినదంతయు జాతకము ననుసరించియే యున్నది మరాటి మహారాజా! ముందు నేనొక వీరకుమారునకు భార్యనయ్యెద ననియు, పిదప నొక మహామాంత్రికునిచే బంధింపబడెదనని చిన్న నాడే శాస్త్రజ్ఞులు చెప్పిరి. అయితే రాజా! నే నడుగుబెట్టిన చోట నన్ను ప్రేమించినవారికి పదునాలుగేండ్ల కొక ప్రాణగండ మున్నదనియు చెప్పిరి.

పకీ:- (వికటముగనవ్వి) ఈ మరాటికి ప్రాణగండమన్నమాట మరిచిపో బాలా! నన్ను చంపేవాడు లేడంటే నమ్మవే వెర్రినాగమ్మా!

బాల:- అలాగ అనకండి. అన్నివేళలు మనవికావు. ఆ గండం సామాన్యమైనది కాదట. అందుకే యీ వ్రతమాచరించాను. వ్రత ఫలితం ముందుగ వివరించరాదనుటచే నింతకుముందు చెప్ప లేదు. ఈనాడు నిజందాచటానికి వీలులేకపోయినది. ఏమో - యే సమయ మెలాంటిదో - మీ మరణానికి యెవరు పుట్టి యున్నారో - ఎల్లుండిరాత్రి తెల్లవారేదాకా నేను జాగ్రత్తగ నుండాలి.

మరా:- పిచ్చిపిల్లా! పకీరును చంపేవాడు ప్రపంచములో లేడు. ఎవ డైన, ఏనాడయినా, నా ప్రాణములున్న చిలుకను పట్టుకుంటే గద నా ప్రాణాలు తీయగల్గటం ?

నాగ:- నీ ప్రాణాలు నీ బొందిలోలేవా ? మరొక చిలుకలో మరుగు పెట్టారా ? మీ మాటలు నాకేం అర్థం కావటంలేదే ?

మరా:- అర్థంకాలేదా అమాయకపు పిల్లా! సప్తసముద్రాలు దాటా లి - జీవిగడ్డను చేరాలి - మర్రిచెట్టు తొర్రలోదూరి పాములు

తేళ్ళను తప్పించుకోవాలి – చింతచెట్టుననున్న పంజరంలోని చిలుకను పట్టాలి – అప్పుడా చిలుకలోవుంది నాప్రాణం.

బాల:– ఆహా! ఎంత అదృష్టం ? ఎటువంటిమాటలు విన్నాను ?

మరా:– దీనికే యింత సంతోషమా ? ఇంక మూడురోజులు జరిగితే యెంతయినా మహాదృష్టంపండి మనోభీష్టాలు తీరుతాయి. సరే ఈ మూడురోజుల్లో మునిగిపోయిందేముంది? పోయి మళ్ళీవస్తా.

(నిష్క్రమించును.)

## (రెండవరంగము:)

(సముద్రతీరమున — బాలవర్ధిరాజు)

బాల:– (ఉత్తరమును చదువుచు) ఏడు సముద్రములను దాటి – కడనున్న సముద్రములో, జీవిగడ్డలో, మఱ్ఱిచెట్టు తొఱ్ఱలో, పాములు, తేళ్ళమధ్యలో, చెట్టుకొమ్మలలో కట్టియున్న పంజరంలో వుండే చిలకలో పకీరు ప్రాణమున్నది. కట్టా! ఈ స్వల్ప కాలములో నీ కార్య మెట్లుసాధింతును? మరాఠి నెట్లు జయింతును ? గడువు దాటినపిమ్మట ఘడియ జరిగినను మాయమ్మ నాకు దక్కదే ? ఏమి చేయుదును ? ఏమి చేయవలయునన్నను అవకాశము లేదుగదా; సప్తసముద్రములను దాటు నుపాయ మేది ? (ఆలోచించి, చేతులుమోడ్చి) తల్లీ! భగవతీ! అవసరమైనపుడు స్మరించినంత నాకు దర్శనమిచ్చి దయ చూపుదు నంటివే! అనుగ్రహింపుము తల్లీ!

మ॥ భవదీయంబగు సత్కృపామహిమచే ప్రాప్తించు చంద్రాయుధం
బు వహించేను జయించినాడ– విజయంబుల్ కొన్ని –సంద్రంబులన్
భువిపై నిప్పుడు దాటుటెట్లో? జననీ! పూన్కిన్ కటాక్షించి ర
మ్మా విశేషప్రతిభా ఫలంబిడగ నా మ్రొక్కుల్ గ్రహింపంగదే.

కాళి:– (ప్రత్యక్షమై) వత్సా! చింతింపకుము, అటుచూడుము, అందొక వటవృక్షంబు, అందొకగండభేరుండము చిరకాలమునుండియు

వసించుచున్నది. దానిబిడ్డలా గూటియందే కలవు. చెట్టుమొదటలో నున్న దుష్టసర్ప మనుదినమా చెట్టునెక్కి పెద్దపక్షులు లేని సమయంబున వాటిపిల్లలను చంపుటయు, దాచుకొనిన ఆహారమును తినుటయు చేయుచున్నది. నీవందేగుము సర్పము బైటకువచ్చు సమయమును సమీపించుచున్నది. పొంచియుండి నీవాభుజంగమును బరిమార్పుము. నీ యుపకారమున గాగండభేరుండ మిధునంబు సంతసించి నీకు ప్రత్యుపకారముగ సాగరముల దాటింతురు. అచటి పాములు తేళ్లను సంహరించుటలో నీకు సహాయపడగలరు. త్వరగ నడువుము.

బాల:- కృతార్థుడను తల్లీ ! కృతార్థుడను.

గీ॥ నిరుపమానమై యొప్పారు నీదుకరుణ
నన్నురక్షించునట్టులే నాదుతల్లి
దండ్రులనుగూడ కాపాడి దనరుమమ్మ
వందనములమ్మ దేవి నీ పాదములకు

(నిష్క్రమించును)

( చెరసాలలో, బాలనాగమ్మ )

నాగ:- గడువు మించుచున్నను కొడుకు రాడేమిచెప్పుమా !

ఉ॥ దాటెనొ సప్తసంద్రముల ? దాటగ నేరడొ ? దాటెనేని; తత్
కూటవి సర్పవర్గములగూల్చెనొ ? గూల్చగ లేదొ ? గూల్చినన్
మేటిశుకంబుజిక్కెనొ ? శ్రమించినచిక్కదొ ? నాదుబిడ్డడే
పాటుననుండెనో ? తిరిగివచ్చునొ ? రాడొ ? మదీయవ్రాలెదో ?

ఇపుడు నేనేమియు చేయజాలకుంటినిగదా ?

గీ॥ బిడ్డవచ్చునటంచు జీవించియున్న
దుడుకున మరాటిచే భంగపడుదు నేమొ ?
కొడుకురాడంచు జీవముల్ గోలుపోవ
తిరిగివచ్చి బాలుండు చింతించు నేమొ ?

మరా:- (కోపముతో ప్రవేశించి) ఓసీ! మూర్ఖురాలా! నన్నే మోసం చేయుచున్నావా ?

నాగ:- ఛీ! మూర్ఖుడా! నాబొందిలో ప్రాణములుండగ నన్ను నీవు పెండ్లియాడలేవు - ప్రేమించలేవు పోమ్మావలకు.

మరా:- నామాటను ధిక్కరించావే మాయదారీ! వంటింటికుందేటికీ వదరు బోతుతనమా ? బోనులోనిపులి కింకా బోకరింపులటే ? వ్రతము పూరితయిననూ మతితిరుగలేదా ?

నాగ:- నావ్రతము నీమరణమునకు పట్టిన వ్రతమే నీచుడా!

మరా:- ఏమికూయుచున్నావు. మరాటినే మోసగించి పారిపోవలయు ననియా ? ఏయ్ పిల్లా! పిచ్చిపిచ్చి వేషాలువేయకు - చచ్చి పోతావు. పకీరు చేతబడిన ప్రాణిని వరాకుగ విడిచేదిలేదు. లే, లే. ముందులేచి, ఆనందంగ అలంకరించుకో సమీపించ బోతున్నది. పెళ్లిముహూర్తం.

నాగ:- ఛీ! దుర్మార్గుడా సమీపించుచున్నది. నీ పెళ్లిముహూర్తముగాదు. నీ మరణముహూర్తం. నీకింకజరిగేవి శార్ధ క్రియలు - పెళ్లి వేడుకలుగావు. ఈ బాలనాగమ్మ నీపాలిటి మృత్యుదేవికాని, నీ ప్రియురాలుకాదు - కాదు - ముమ్మాటికికాదు.

మరా:- బాలా! బ్రతుకుమీద నీ కాశయున్నదా ?

నాగ:- నీ బ్రతుకుసంగతి నీవు చూచుకుంటెచాలు.

మరా:- అలాగేం ? అయితేవుండు. సంగులా నిన్నుగూడ కుక్కనో నక్కనోచేస్తా (మంత్రదండంచేత బట్టుకొనును)

( బాలవర్ధిరాజు ప్రవేశము )

బాల:- (పెద్దగ) ఆగు.

మరా:- (వెనుకకుతిరిగి) నీవా, వీరయ్యా!

బాల:- నేను వీరయ్యను కాను - పేరయ్యనుకాను. బాలనాగమ్మ కొడుకును - బాలవర్ధిరాజును. నీ ప్రాణాల గుట్టునెరింగిన నీ పాలిటి యమధర్మరాజును.

మరా:- అయితే యిక్కడి కెందుకు వచ్చావ్ ?

బాల:- నీ మరణకాల మహోత్సవాన్ని నేత్రానందంగ చూడటానికి - నా మాతృదేవిని రక్షించటానికి - నా తండ్రులను బ్రతికించడానికి వచ్చాను.

మరా:- (కోపముతో) ఆఁ! ఏమన్నావూ ? (మంత్రదండము నెత్తబోవును)

బాల:- ఆగు. (చిలకమెడ బట్టుకొనును.)

మరా:- (తనమెడను మరొకరు పట్టుకొన్నటులు బాధ ననుభవించుచు) మోసం, మోసం. అంతా మోసం.

బాల:- ఏమిటా మోసం?

మరా:- పచ్చిమోసం - పరమమోసం. ఏమే బాలా! నా ప్రాణ రహాశ్యం వీడికి చెప్పావటే నీచురాలా!

బాల:- ఆగు. నిన్ను మోసగించినది నేను - ఆ సమాధానము నాతో చెప్పు.

మరా:- పూలమాలలు కట్టే పనివాడివిలావచ్చావు - మరులు త్రిప్పే మాంత్రికుడివిలా నటించావు - దొంగతనంగ నా గుట్టు దోచుకున్నావు.

బాల:- నీ కంటె నేనేమి దొంగనుకాను - నీవు చేసిన మోసముకంటె నేను చేసిన మోసము గొప్పదికాదు.

సీ॥ మాయజంగమువోలె మా పురివీధుల
నరుదెంచు టేమంత దొరతనంబు ?
తండ్రు లేద్వురు లేని తరుణంబుజూచి యా
తరుణి నపహరింప దొరతనంబె ?

నీ నీచకామంబు నిరసించు నేరాన
మరుగున బంధింప దొరతనంబె ?
నిజము వక్కాణించు నెలత సంగునుబట్టి
మొరుగు కుక్కనుచేయ దొరతనంబె ?
గీ॥ దొరతనమనుపేర నీ దొంగతనము
పట్టుపడదొక్కొ ? పాపంబు పండదొక్కొ ?
దొంగలకు దొంగవగు గజదొంగ నిన్ను
దొంగనై బట్టి నే పోటు దొంగనైతి.

అది సరికాని, యీ బాలనాగమ్మ నీకేమి కావలయును ?

మరా:- నా భార్య.

బాల:- ఆఁ (అని చిలుక మెడ బట్టుకొనును)

మరా:- (భయముతో) ఆఁ. ఆఁ. వద్దు. బాలవర్ధి దానిని చంపవద్దు. కావాలంటే అలాంటి చిలుకలు వేయి చిలుకలను యిస్తాను. బంగారపు చిలుకలను యిస్తాను. ఆ చిలుక నీ కెందుకు ? అవతల విడిచిపెట్టుము.

బాల:- ఓరీ! మాయావీ! నీ మాటలు నాముందుసాగవు. ఈ చిలుకలో నీ ప్రాణమున్నదని తెలిసియే పట్టుకొన్నాను. నీవు చావాలి – నే నీ చిలుకను వదలాలి. ఇప్పుడు చెప్పు. బాలనాగమ్మ నీకేమి కావాలి ?

మరా:- నా భార్య.

బాల:- (కోపముతో) ఆఁ. (చిలుకమెడ పట్టుకొనును)

మరా:- కాదు – కాదు.

బాల:- చెప్పు. బాలనాగమ్మ నీకేమి కావాలి ?

మరా:- బాలనాగమ్మా! బాలనాగమ్మ నాకేమీ కాదు.

బాల:- (చిలుకనుచూచి) ఏమీ కాదా ?

మరా:- వద్దు. వద్దు. బాలనాగమ్మ – నాకు – నాకు –

బాల:- చెప్పు.

మరా:- తల్లి.

బాల:- మళ్ళీ.

మరా:- తల్లి.

బాల:- బాలనాగమ్మ నా తల్లియని పాదాలు పట్టుకో.

నాగ:- ఆగు. పాపాత్ముడా! నీవు దా పాదాలనయిన ముట్టతగవు.

బాల:- బాలనాగమ్మ తల్లీ! క్షమించమని చెంపలు వేసికో.

మరా:- బాలనాగమ్మ నాతల్లి. (చెంపలు వేసికొనును.)

బాల:- ఆ మంత్రదండంతో మరణించిన వారినందరినీ బ్రతికించు ఊం ముందు మా తండ్రులను బ్రతికించు.

మరా:- (మంత్రదండ మావైపుచూపును)

బాల:- సంగును బ్రతికించు.

మరా:- (మంత్రదండ మటుచూపును.)

బాల:- మిగతా వారినందరిని బ్రతికించు.

మరా:- (మంత్రదండ మావైపునకుచూపును.) బ్రతికించాను—అందరిని బ్రతికించాను. నన్ను నీవు బ్రతికించు.

బాల:- నిన్ను బ్రతికించినచో ప్రపంచము నిలువదు.

( కార్యవర్ధిరాజు ప్రవేశము )

కార్య:- (బాలనాగమ్మను సమీపించి) బాలా!

నాగ:- నాథా! మీకుమారుడు. బాలవర్ధిరాజు మన చిరంజీవియే మన కష్టంబుల నన్నింటిని కడతేర్చినాడు.

కార:- (ఆలింగనముచేసికొని) నాయనా! కుమారా! ఎంతవాడవైనావురా నా తండ్రీ!

మరా:- అమ్మా! బాలనాగమ్మ! నీపాదాలకు నమస్కరించుచున్నాను. శరణన్నవానిని చంపవచ్చునా? నన్ను రక్షించమని చెప్పు తల్లీ!

నాగ:- నాయనా! శరణాగతరక్షణము క్షత్రియధర్మముగదా? అది యునుగాక, వీడిభార్య సంగు నాకుపకారి. ఉపకారి కేనియు నుపకారము చేయవలయునుగదా? స్త్రీలకు మాంగల్యము నిలుపుటకన్న మించిన మహోపకారమేమున్నది? సంగుకు పతిభిక్షనిచ్చుట కొరకైన వానిని విడువవలయునుసుమా!

బాల:- నాన్నగారూ! మరాఠిని విడిచిన ప్రమాదము సంభవించగలదు- తల్లిగారి యానతి తృణీకరింపరానిది. ఈ సమయంబున నాకేమి సెలవిత్తురు?

కార్య:- కుమారా! నీ యాలోచన సమంజసము. నీ చేతిలోని చిలుక రెక్కలు లాగి వదలివేయుము. అద్దాన మరాఠి మంత్రశక్తు లన్నియు నశించి సామాన్య మానవునివలె సంగుతో సంసారము చేసికొనును. మనకు ధర్మరక్షణ - వానికి ప్రాణరక్షణ లభింపగలదు.

బాల:- ఓయీ! పకీరూ! నిన్ను కరుణించి ప్రాణాలతో విడుచుచున్నాను. భయభక్తులతో జాగ్రతగ సంచరించుకొనుము. (చిలుక రెక్కలు లాగి విడిచిపెట్టును.)

మరా:- తల్లీ బాలనాగమ్మా! నీ విట్టి యుత్తమ సంతానము గాంచుట చేతనే భారతమాత నేటికిని ధన్యమైనది. నీ పాతివ్రత్యము నిరుపమానముగ ప్రకాశించుగాక. భావిభారత నారీలలామలకు నీ వాదర్శ ప్రాయురాలవుదువుగాక.

నాగ:- అయిన నిట్లగుగాక.

గీ॥ ఆలుమగలలోన మమత లలుముకొనుచు
మధ్యవచ్చెడు కష్టాల మాన్పుకొనుచు
శీల మర్యాదలను సర్వసిరులు వెలయ
సత్సుతుల బడయుగాత నీ సర్వజనులు.

కార్య:- తథాస్తు.

బాల:- ధన్యులము. జై! (తెర జారును)

—: బాలనాగమ్మ నాటకం - సంపూర్ణము :—

ముద్రణ : ఆంధ్రరత్న పవర్ ప్రెస్, తెనాలి.